# విఖ్యాత నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| శ్రీకాంత | (శరత్) | 7–8 |
| పల్లెజీవనం | | 2–0 |
| వాగ్దానం | | 2–0 |
| చంద్రనాథ్ | | 1–8 |
| దేవదాస్ | | 1–8 |
| అరక్షణీయ | | 1–4 |
| పరిణీత | | 1–0 |
| స్వామి | | 1–0 |
| అనుపమాదేవి | | 1–0 |
| బిందుగారబ్బాయ్ | | 1–0 |
| బడీబహాన్ | | –12 |
| సుమతి | | –12 |
| విప్రదాస్ | | 3–0 |
| పవిత | | 4–0 |
| సుందరి | (సాంఘిక) | 2–8 |
| ఫాదరిండియా | | 1–8 |
| మదర్ యిండియా | | 1–0 |
| హరిచరణుడు | | 1–0 |
| గరీబ్ | | 1–0 |
| భిక్షుకి | | 1–0 |
| నాగమ్మ | | 1–0 |
| నీలకంఠం కథలు | | 1–0 |

వలయువారు

కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,

సంస్కృతాంధ్ర గ్రంథాలయం, రాజమండ్రి.

# ప్రణయ మందిరం

శ్రీ జొన్నలగడ్డ వేంకట రాధాకృష్ణయ్య
( ఆంధ్రప్రభ సబ్ ఎడిటర్ )

ప్రకాశకులు
కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
సంస్కృతాంధ్ర గ్రంథాలయం (స్థా. 1882) రాజమండ్రి.

# ముందుమాట

అనుకొన్న పని జరగకపోతే ఆశాభంగం కలిగి మనస్సు బాధ పడుతుంది. ఇది మానవప్రకృతికి సహజం. అయితే ఈ ఆశాభంగం ప్రేమ విషయం లోనే సంభవించినపుడు కలిగే ఆవేదనకు మితే వుండదు. దానివల్ల హృదయం ఎంతటి తీవ్రనై రాశ్యానికి లోనయ్యేదీ, ఎట్టి విషమ పరిణామాలకు దారి తీసేదీ చెప్పలేము. తమ ప్రేమ విఫల మైనప్పుడు — తిరస్కరించ బడినప్పుడు మతులు పోగొట్టుకొన్నవారు, ఆత్మ హత్యలకు పాల్పడిన వారు, స్వస్థానాలు త్యజించి దేశాంతరగతులై పోయినవారు — స్త్రీలలో — పురుషులలో అనేకు లున్నారు. ప్రణయ విప్రకృతమై, మనశ్శాంతి కోసం పరితపించిపోయిన యువతి హృదయాంతర్గత భావపరంపర చిత్రణయే ప్రణయ మందిరం.

—రచయిత

ఇది తొలిత "ఆంధ్రప్రభ" లో సీరియల్‌గా ప్రకటించబడది.

ఆమె వెళ్ళిపోతోంది. ఆమె ప్రయాణంచేస్తున్న రైలువలెనే హృదయంకూడా పరుగిడుతున్నది. ఆమె మనస్సు ఎంతో వికలమైపోయివున్నది. తాను ఈ విధంగా ఇల్లువదలి, స్వస్థానం వదలిపోవలసివచ్చినందుకు కారణభూతమైన సంఘటనను తల్చుకొనగానే ఆమె హృదయం ఆవేదనా విదళితమైపోయినది.

పోక తాను చేయగలిగినదేమి ? తాను రెండేళ్ళ క్రితమే మోరిసన్ ఆసుపత్రిలో నర్సుగా చేరింది. అక్కడకు డాక్టర్ గా వచ్చిన సీతారామ్‌ను ప్రేమించింది. తనకు అతనికి మధ్య అగాధంవుందని తెలిసినా మనస్సును నిగ్రహించుకోలేక పోయింది.

తనతో అతడు చనువుగా మాట్లాడుతూవుంటే హృదయం ఆనందభంగమాలికలలో తేలిపోగా తన్మయత్వం చెందేది.

తన ప్రేమను వెల్లడించడం ఎలాగ అని పరిపరివిధాల యోచిస్తున్నరోజులలోనే అతడు ఒకసారి ఆమెఇంటికి వెళ్లాడు. అప్పటికి కాలేజీలో చదువు ముగించిన తన అక్క ఇంటికి వచ్చి వుంది. తల్లి బాల్యంలోనే గతించారు. తండ్రి మరణించి

# ముందుమాట

అనుకొన్న పని జరగకపోతే ఆశాభంగం కలిగి మనస్సు బాధ పడుతుంది. ఇది మానవప్రకృతికి సహజం. అయితే ఈ ఆశాభంగం ప్రేమ విషయం లోనే సంభవించినపుడు కలిగే ఆవేదనకు మితే వుండదు. దానివల్ల హృదయం ఎంతటి తీవ్రనైరాశ్యానికి లోనయ్యేదీ, ఎట్టి విషమ పరిణామాలకు దారి తీసేదీ చెప్పలేము. తమ ప్రేమ విఫలమైనపుడు — తిరస్కరించ బడినప్పుడు మతులు పోగొట్టుకొన్నవారు, ఆత్మ హత్యలకు పాల్పడిన వారు, స్వస్థానాలు త్యజించి దేశాంతరగతులై పోయినవారు — స్త్రీలలో — పురుషులలో అనేకు లున్నారు. ప్రణయ విప్రకృతమై, మనశ్శాంతి కోసం పరితపించిపోయిన యువతి హృదయాంతర్గత భావపరంపర చిత్రణయే ప్రణయ మందిరం.

—రచయిత

---

ఇది తొలుత "ఆంధ్రప్రభ" లో సీరియల్‌గా ప్రకటించబడ్డది.

త్రామె వెళ్ళిపోతోంది. ఆమె ప్రయాణంచేస్తున్న రైలువలెనే హృదయంకూడా పరుగిడుతున్నది. ఆమె మనస్సు ఎంతో వికలమైపోయివున్నది. తాను ఈ విధంగా ఇల్లువదలి, స్వస్థానం వదలిపోవలసివచ్చినందుకు కారణభూతమైన సంఘటనను తలచుకొనగానే ఆమె హృదయం ఆవేదనా విదళితమైపోయినది.

పోక తాను చేయగలిగినదేమి ? తాను రెండేళ్ళక్రితమే మోరిసన్ ఆసుపత్రిలో నర్సుగా చేరింది. అక్కడకు డాక్టర్‌గా వచ్చిన సీతారామ్‌ను ప్రేమించింది. తనకు అతనికి మధ్య అగాధంవుందని తెలిసినా మనస్సును నిగ్రహించుకోలేక పోయింది.

తనతో అతడు చనువుగా మాట్లాడుతూవుంటే హృద యం ఆనందభంగమాలికలలో తేలిపోగా తన్మయత్వాం చెందేది.

తన ప్రేమను వెల్లడించడం ఎలాగ అని పరిపరివిధాల యోచిస్తున్నరోజులలోనే అతడు ఒకసారి ఆమెఇంటికి వెళ్ళాడు. అప్పటికి కాలేజీలో చదువు ముగించిన తన అక్కఇంటికి వచ్చి వుంది. తల్లి బాల్యంలోనే గతించారు. తండ్రి మరణించి

మూడేండ్లు కావస్తున్నది. అక్క సునేత్ర డాక్టర్ సీతారామ్‌ను ప్రథమ సందర్శనంలోనే ప్రేమించింది. డాక్టర్ సీతారామ్ కూడా ఆమెను మనసార ప్రేమించాడు.

ఆ ఉత్తరక్షణంనుంచి తన ఉనికినే అతను గమనించ లేదు.

సునేత్ర డాక్టర్ సీతారామ్‌ను పెళ్ళి చేసుకొంది. ఈ వివాహం జరిగి ఇంకా వారంరోజులైనా కాలేదు. తాను వలసిన పురుషుడు – తన అక్క కలిసి తమ ఇంటిలోనే వుంటున్నారు. వారి కబుర్లు వింటూ వారిని చూస్తూ తన మనస్సును దహిస్తున్న విషాదాగ్నిజ్వాలలు చల్లారేమార్గం కానక, ఆసుపత్రి సూపరింటెండెంట్ ఇంటికి వెళ్ళింది. తనకు అయిదారుమాసాలపాటు ఎక్కడైనా ప్రయివేటు నర్సుపని చూపించి సహాయం చెయ్యవలసినదని ప్రాధేయపడి కోరింది.

మోరిసన్ ఆసుపత్రి సూపరింటెండెంట్ డాక్టర్ సురేష్ నాయర్, నవనీతం– అది ఆమె పేరు– తండ్రికి ఆప్తమిత్రుడు. తండ్రి పోయినపుడు ఆయనే వారి నాదరించాడు. సునేత్ర కాలేజీలో చదువు పూర్తి చెయ్యడానికి ఏర్పాటు చేశాడు. తనకు నర్సుగా శిక్షణ పొందడమే అభిమతమని నవనీతం చెప్పగా ఎంతో సంతోషించి, తానున్న ఆసుపత్రిలోనే శిక్షణ నిప్పించి ఉద్యోగ మిచ్చాడు.

డాక్టర్ సీతారామ్‌ను ఆమె ప్రేమించినట్లు ఆయన కర్ణాకర్ణిగ తెలుసుకొనలేకపోలేదు. విని ఆయన సంతోషించటే

పోలేదుకూడా. అయితే ఈ పరిణామంలో మార్పు సంభవించిన తర్వాత నవనీతం ముఖమండలంలో హాసచ్ఛాయలు మాయమై. విషాదరేఖలు అలముకొనడంకూడా గమనించక పోలేదు.

కనుకనే ఆమె "ప్రయివేటు నర్సు పని" ఇప్పించ వలసినదిగా కోరినపుడు కాదనలేకపోయాడు.

తాను అంతకుముందు చికిత్స చేసిన ఒక జమీందారు రాసిన లేఖను టేబుల్ సొరుగులోనుంచి తీశాడు.

"ఇదిగో–విను–కొడైకెనాల్‌లో కె. ఎల్. రంగస్వామి అనేఆయన వ్రాసిన ఉత్తరం ఇది. ఆయన మూడు సంవత్స రాలకు పూర్వం గుర్రంమీదనుంచి పడ్డాడు. అప్పటినుంచి లేవలేక మంచంమీదనే వున్నాడు. ఆయనకు ఎవరో ఒక డాక్టరు చికిత్స చేస్తున్నాడు. ఆ రంగస్వామికి ఒక నర్సు కావాలి. నీకు ఉత్తరం ఇస్తాను. నువ్వు వస్తున్నావని టెలిగ్రాం ఇస్తాను, వెళ్లు" అని డాక్టర్ నాయక్ అన్నాడు.

సరే అని నవనీతం బయలుదేరింది. రైలు కొడైకెనాల్ స్టేషన్‌ను సమీపిస్తున్నకొలదీ డాక్టర్ సీతారాం తన అక్కల పెళ్లిసంగతులే జ్ఞాపకానికి వచ్చి, మనస్సును కలవర పెడు తున్నాయి.

తనకంటె సునేత్ర ఏణ్ణర్థం పెద్దది. ఎంతో అందమైనది. నిజానికి, తన అక్కదగ్గర నిలబడటానికికూడా తనకు అర్హత లేదు—అందంమాటకునస్తే. అయితే తానుకూడా రూపవతి ననే నమ్మకం ఆమెకు లేకపోలేదు.

సరిగా సాయంకాలం ఆరుమ్ముప్పావు గంటలకు రైలు కోడై కెనాల్ స్టేషన్‌లో ఆగింది. అక్కడ రైలు దిగినది తాను ఒక్కర్తె కావడం – మునిమాపు చీకట్లు ప్రపంచాన్ని క్రమ్ముకుంటూ వుండడం – పైగా ఆకలి – ప్రయాణపు బడలిక. ఇవి అన్నీ ఆమెకు కొంచెం చిరాకునే కలిగించాయి. ఎవరైనా తన కోసం వస్తారో, రారో అనుకొంటూనే ఆమె స్టేషన్‌లోకి నడిచి, టిక్కెట్టు ఇచ్చి బయటకు వెళ్ళింది.

* * *

సరిగా అదే సమయానికి ఒక చిన్న కారు వచ్చి అక్కడ ఆగింది. ఆ కారులోనుంచి ఒకాయన–సూట్ ధరించి వున్నాడు– దిగి – తిన్నగా ప్లాట్‌ఫారంమీదకు వెడుతూ ఒకసారి తనవంక చూచి – ప్లాట్‌ఫారంమీద ఎవరు కానరాకపోవడంతో కాబోలు తిరిగివచ్చి——

" మిస్ నవనీతం——? " అంటూ ప్రశ్నార్థకముగా తన వైపు చూశాడు.

" నేనే——"

" అయితే డాక్టర్ సురేష్ నాయర్ పంపించిన నర్సువు నువ్వేనా ? "

" అవునండి——"

" సారీ ! పనికిరావు. వచ్చినదారినే వెళ్ళిపోవచ్చు. మదరాసుకు పోయే రైలు సరిగా మరోగంటకు వస్తుంది "

అసలే వికలమైపోయివున్న ఆమె మనస్సుకు ఈ మాటలు మరింత బాధ కలిగించాయి. ఆమెకు కోపంవచ్చింది.

"మీ రెవరో నాకు తెలియదు. కాని నేను తిరిగి వెళ్ళడం కోసమే ఇంత దూరం రాలేదు" అంది నవనీతం.

"రంగస్వామిగారి డాక్టరును నేను. నా పేరు శ్రీనివాసన్"

"అలానా నాకు తెలియదు. అయితే నర్సును పంపమని మీరో, రంగస్వామిగారో డాక్టర్ నాయర్‌గారికి వ్రాశారు. ఆయన నన్ను పంపించారు. నేను పనికిరానని అంటే—"

"నీ వయస్సు మరీ తక్కువ. పైగా నీ అంత అందమైన అమ్మాయి అవసరంలేదు"

"నా వయస్సు 21 సంవత్సరాలు. అందానికీ సమర్థతకీ సంబంధం ఏమిటి? సమర్థతకు అందవికారం కొలతబద్దా ఏమిటి? ఒక కేసులో పనిచేసే డాక్టరుకు ఎదురుతిరిగి జవాబు చెప్పడం నర్సుకు లక్షణంకాదు. కాని, ఇంకా ఈ కేసులో నేను కుదరలేదు కనక, మీ మాటకు ఎదురు చెప్పడం తప్పు కాదు. నేను సమర్థురాలినో కాదో ఒకరోజైనా చూడకుండా పొమ్మనడం డాక్టర్‌కు లక్షణంకాదు. హృదయం వున్నవాడు ఎవరూ అలా అనరు. పైగా నిర్జనమైన ఇలాంటి ఊరుకు — సౌకర్యాలకు దూరమై అవసరమైతే ఇరువైనాలుగ్గంటలు సేవ చెయ్యడానికి ఎవరు వస్తారండీ"

ఆమె సమాధానానికి కొంచెం రిచ్చపడ్డా, ఆ రిచ్చపాటు స్థానే డాక్టర్ శ్రీనివాసన్ ముఖంపైన మందహాసం తోచింది.

డాక్టర్ శ్రీనివాసన్—వయస్సు పెద్దదికాదు-రూపసే-అయితే తొలి సమావేశంలోనే తగవు పడితే ఆయనతో కలిసి రోగికి ఉపచారాలు చెయ్యడం కష్టసాధ్యంకాదూ !

"మిస్ నవనీతం ! నువ్వు అన్నమాట బాగానేవుంది. సరే ఒక నెలరోజులు చూస్తాను. నువ్వు పనికిరావనితోస్తే పంపించివేస్తాను. అందంగా వుండడం ఈ పనికి అనర్హత కాదు. అయినా చూస్తానుగా. రా" అంటూ ఆమె సూట్ కేసులు రెండూ పట్టుకొని కారులో పెట్టాడు.

నవనీతం ప్రక్కన కూర్చొనగా, కారును స్టార్టుచేసి, దారిలో రంగస్వామిగారిని గురించి చెప్పకు వచ్చాడు.

"ఆయన లక్షాధికారి. స్వస్థానం తిరుచినాపల్లి. మూడేళ్ళక్రితం గుర్రంమీద స్వారిచేస్తూ పడ్డాడు. వెన్నెముక దెబ్బతింది. ఎంతోమంది స్పెషలిస్టులను పిలిపించాం. చికిత్స చేయించాం. కానీ, దారీ-అంతూ దొరకడం లేదు. ఆయనకు సేవ చెయ్యాలి నువ్వు. ఇరవైనాలుగ్గంటలు ఆయనను కనిపెట్టు కుని కూర్చోనక్కరలేదు, ఆయన నౌకరు స్వామి వున్నాడు. అహర్నిశాలు ఆయనను కనిపెట్టుకుని వుంటాడు. మందులు కలిపి ఇవ్వడానికి, కట్టు కట్టుతూ వుండడానికి నర్సు అవసరం. వూళ్లో ఆసుపత్రి వుందికాని,—అక్కడ వున్న నర్సులకు క్షణమైనా తీరిక లేదు.

# 2

కారు ఒక పెద్ద బంగళాముందు ఆగింది. "ఇదే రంగస్వామి గారి బంగళా" అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్.

నౌకరు స్వామి పరుగెత్తుకుంటూ వచ్చి, నవనీతం సూట్ కేసులు—బెడ్డింగ్ చేతపట్టుకొని లోపలకు తీసుకు వెళ్లాడు.

బంగళా ఎంతో పెద్దది. హాలులోనికి వెళ్ళగానే ప్రక్కనే వున్న ఒక గది తలుపు తెరుచుకొని వచ్చిన ఆమెను చూచి, నవనీతం ఎంతో ఆశ్చర్యపడ్డది.

"అబ్బ! ఎంత అందంగా వుంది—దేవతలంటే—ఇలాగే వుంటారేమో" అనుకొంది.

"రంగస్వామిగారిభార్య—శ్రీమతి జయలక్ష్మి—నర్స మిస్ నవనీతం" అంటూ ఉభయులను డాక్టర్ శ్రీనివాసన్ పరిచయపరిచాడు.

"ఆహా! ఎంత చక్కని చుక్క—ముద్దుల మూట కడుతూవుంది. ఈ పిల్లను చూస్తేనే రోగం నయమౌతుంది"

"నిజమేనా? అంత చక్కగా వుందా?" అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్.

"తప్పు, అలా అనకండి. మీకు అసలు ఆడవాళ్లంటే ద్వేషమా ఏమిటి? ఆయన ఈ పిల్లనుచూచి సంతోషిస్తారు.

అస్తమానం కంటికి ముల్లులా కనిపిస్తానో ఏమో. విసుగా చిరాకూను"

"చూడు. అహర్నిశలూ ఆయన సేవచేసి సతమతమై పోతున్నది ఆమె. నువ్వు విశ్రాంతి యివ్వాలి"

"అనుమతిస్తే—ఆవిడ ఏమీ కష్టపడకుండా చూస్తాను" అంది నవనీతం.

"నేను సుఖపడదలచుకో లేదు. ఆయన బాధ చూడ లేను. చూస్తూ ఏమీ పరిచర్య చెయ్యకుండా వుండగలనా? పాపం ప్రయాణం చేసి అలసిఅలసివున్నావు - నీకు ఒక గది ప్రత్యేకంగా ఏర్పాటు చేశాను. అక్కడ వుండు. దీనిని నీ సొంత ఇల్లుగా భావించుకో. నీ కిక్కడ ఏ లోటూ వుండదు. ముందు స్నానంచేసి తర్వాత భోజనం చేద్దువుగాని – వీలైతే ఆనక – లేకపోతే రేపు ప్రొద్దున్న ఆయనను చూద్దువుగాని, మీరుకూడా భోజనానికి వుండండి డాక్టర్‌గారూ" అంది జయలక్ష్మి.

"నే నెందుకు? చక్కని చుక్క నువ్వూకలిసి భోజనం చెయ్యండి" అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్ నవ్వుతూ.

"నిజంగా చక్కనిచుక్కే" అంది జయలక్ష్మి.

"నీకంటేనా" అన్నాడు శ్రీనివాసన్ చాలా మెల్లగా.

ఆమాట తనకు వినిపించనట్లు జయలక్ష్మి నవనీతాన్ని ఆమె గదిలోనికి తీసుకువెడుతూ—"నీ మనస్సుకు ఎప్పుడు ఏ కష్టం కలిగినా నాతో చెబుతూవుండు. బాధపడకు. మనస్సు అస్వస్థంగా వుంటే ఏపనీ చేయలేము" అంది.

" నిజమే. అదేం దురదృష్టమో కాని - స్టేషన్‌లో అడుగు పెట్టగానే నాకూ, డాక్టర్‌జీకి మధ్య చిన్న భారత యుద్ధం జరిగింది. అందంగా వున్నావనీ- వయస్సు తక్కువనీ- కనక పనికిరా నన్నారు. అంతటితో ఊరుకోన్నారా - ఎనిమిది గంటల రైలుకు తిరిగి మదరాసు పొమ్మన్నారుకూడా. "

" ఆ! అదేంమాట? విపరీతమాని. నేను అడుగు తానులే. ఆయన్ను మేము చాలా సంవత్సరాలనుంచి ఎరుగుదుము. తిరుచినాపల్లిలో వున్నప్పుడే మాకు ఆయన కుటుంబ వైద్యుడుగా వుండేవాడు. యుద్ధంలోకి వెళ్ళకముందు మామూలుగా నలుగురితోను కలిసిమెలిసి వుంటూవుండే వాడు. యుద్ధంనుంచి తిరిగి వచ్చిన తర్వాతనే ఆడవాళ్ళంటే- ముఖ్యంగా యౌవనంలోవున్న పిల్లలంటే మూతి విరుస్తాడు. యుద్ధపు కొలువులో వుండగా ఎవరైన మనస్సుకు గాయం కలిగించారో ఏమో. అయినా మంచివాడు. నేనుకూడా చెబుతాను. నిన్నేమీ అనడు. నీ పని నువ్వు చూచుకొంటే చాలు. అందంగా వున్నావు కనక తన మనస్సు ఎక్కడ అవశమైపోతుందన్న భయమేమో. అయినా నర్సులు డాక్టర్లను పెళ్ళిచేసుకోవాలనే నియమమేమైనా వుందా? లేక డాక్టర్లు ఆదర్శప్రాయులైన భర్తలౌతారని దేముడు ఏమైనా రాసి పెట్టాడా? అటువంటి సందేహాలు ఏమీ నువ్వు పెట్టుకోకు. ఇది నీ గది. అదిగో స్నానమందిరం. ముందు స్నానంచేయి. వెంటనే భోజనం చేద్దువుగాని " అంటూ జయలక్ష్మి వెళ్ళి పోయింది.

# 3

స్నానంచేసి, నీలిరంగు వాయిల్ చీర— తెల్లని వాయిల్ జాకెట్ ధరించి నవనీతం హాలులోకి వెళ్ళింది. ఒక సోఫా మీద డాక్టర్ శ్రీనివాసన్, ఆ సోఫాకుఎదురుగా ఒక కుర్చీలో జయలక్ష్మి కూర్చుని కబుర్లు చెప్పుకుంటున్నారు.

నవనీతాన్నిచూచి మందహాసం చేశాడు డాక్టర్ శ్రీనివాసన్. అతని ముఖంలో ఇప్పుడు ప్రసన్నత తోచింది.

"రా. ఇలా కూర్చో" అంది జయలక్ష్మి.

ఇంతలోకే పరిచారిక వచ్చి— "భోజనానికి వెళ్ళ వచ్చు" అంది—

ముగ్గురు భోజన శాలలోకి వెళ్లారు. భోజనానికి కూర్చున్న తర్వాత పట్టణంలో జరిగిన సంగతులు ఏవో ఇద్దరూ చెప్పుకోంటూవుండగా-తనకు అవి తెలియనిసంగతులు కనుక-తింటూ డాక్టర్ శ్రీనివాసన్ వంక స్థిమితంగా చూచింది.

డాక్టర్ సీతారామ్ అంత అందగాడు కాడని నిర్ణయించు కొంది. అయితే రూపం ఆకర్షణీయమైనదే. ఆ కళ్ళలో ఏదో ఆకర్షణ వుంది. నవ్వితే—ఎందుకో—గుండెల్లోనికి దూసుకు పోయి-వీణ తంతువులను మీటినట్లుగా ఒళ్లు ఝల్లుమంటుంది.

ఆ కళ్లలో సమ్మోహనశక్తి వుంది. స్త్రీలంటే ఆయనకు ఎందుకో ద్వేషం-కర్మంకాదు. కాని, అందమైన స్త్రీ ప్రేమిస్తే-ఈయన ఏం చేస్తాడు. ఏమంటాడు" అనుకొంటూనే డాక్టర్ వంక ఒకసారి తాను దీక్షగా చూచిన సమయంలోనే ఆయన కూడా ఆమెవంక చూశాడు.

"ఆయనమాట నువ్వు వినలేదు కాబోలు. డాక్టరులు ఏదైనా అడిగితే నర్సులు మృదువుగా వెంటనే సమాధానం చెప్పాలా. చెప్పనక్కరలేదా?" అని అడుగుతున్నారంది జయలక్ష్మి.

నవనీతం తొట్రుపడింది.

"క్షమించండి—నేను పరధ్యానంగా వున్నాను. మా అక్కమాట ఏవో తలుచుకొంటూ, ఆ ప్రశ్నను నేను వినలేదు" అంది. తనభావాన్ని ఆయన గుర్తించకపోయినా తన చూపులు ఆయనను కలవరపెట్టి వుంటాయేమో అని భయపడింది.

"ఇక్కడి ప్రకృతి సౌందర్యం చూడడం నీకు ఇష్టమేనా? అని అడిగాను మిస్ నవనీతం అన్నాడు డాక్టరు.

"నేను ఇంతవరకు ఇటువంటి కొండప్రదేశాలు చూడలేదు. నాకు ఇలాంటి చోట్లు చూడాలన్నకోరిక చిన్నప్పటి నుంచీ వుంది"

ఆతర్వాత సంభాషణ కొనసాగినప్పటికీ తాను డాక్టర్ ఒకరి కళ్ళల్లోకి ఒకరు చూచుకొన్న క్షణం గుర్తుకు రాగా

ఆమె: "అతని మనస్సులో అప్పటి భావం ఏమై వుండగలదో" అని ఆశ్చర్యపడ్డది.

"ఈ రాత్రే నేను రంగస్వామిగారిని చూడవచ్చా" అని అడిగింది.

"వద్దు—రేపు ఉదయం నిన్ను తీసుకువెళ్ళి చూపిస్తాను. ఆయనకు ఇందాకనే మందుఇచ్చి వచ్చాను. నిద్రపోతున్నారు" అన్నాడు డాక్టరు.

"ఆయన—బాధపడినప్పుడే— గుండె తరుక్కుపోతుంది" అంది జయలక్ష్మి. అలా అంటూవుండగా ఆమె కళ్ళు చెమ్మగిల్లినవి.

భోజనం ముగిసింది.

"నేను పోయి, సామాను సర్దుకోనా ?" అని అడిగింది నవనీతం.

"వెళ్ళమ్మా" అంటూ గదిదాకావచ్చి దిగపెట్టింది జయలక్ష్మి.

ఆరాత్రి పరున్న తర్వాత "ఇంత అందమైన అమ్మాయి అవసరం కా"దన్న డాక్టర్ శ్రీనివాసన్ మాట జ్ఞాపకానికి వచ్చింది. స్టేషన్‌లో ఉభయులకూ జరిగిన వాగ్వాదంమాట తలుచుకొని, నవ్వుకుని— "నిజానికి సున్నే తే అందకత్తె అనుకొన్నాను. నేనుకూడా అందంగా వున్నానా ? నా అందం నాకు తెలియదు కాబోలు" అనుకొంది.

ఆడపిల్లలంటే డాక్టర్ శ్రీనివాసన్‌కు అంత ఏవగింపు ఎందుకో అనుకొంది. సామాను సర్దుకొని శయ్యపై మేను వాల్చి తాను తెచ్చుకొన్న కథల పత్రికను తీసింది. అప్పటికీ తన మనోవీధిని డాక్టర్ శ్రీనివాసన్ రూపమే కనిపించసాగింది.

" ఇవాళ రాత్రికి నిద్ర పట్టదేమో కర్మం " అనుకొని-దీపం ఆర్పివేసి. కళ్ళు మూసుకొంది.

కారు వెళ్ళిపోయిన ధ్వని వినిపించింది. డాక్టర్‌సాబ్ వెళ్ళిపోయినట్లున్నారు అనుకొంది. బంగళా అంతా నిశ్శబ్దంగా వుంది. హాలులోని గడియారం పదిగంటలు కొట్టింది.

మరో పది నిమిషాలకు బయటినుంచి ఎవరో మెల్లగా తలుపు తట్టిన శబ్దమయింది.

ఆమె లేచి తలుపు తెరిచింది. నౌకరు స్వామి, " అయ్యగారు మిమ్మల్ని ఒకసారి రమ్మంటున్నారు. నిద్రపోయి ఇప్పుడే లేచారు. మిమ్మల్ని చూడాలని అన్నారు "

" ఏం—మళ్ళీ ఏ నొప్పి అయినా వచ్చిందా ? అమ్మగారిని లేపావా ? "

" నొప్పి ఏమీ రాలేదు తల్లీ అమ్మగారు నిద్రపోతున్నారు. ఆవిడగారు లేవనక్కరలేదు " అన్నాడు స్వామి.

నవనీతం మెల్లగా రంగస్వామిగారు వున్న గదిలోనికి వెళ్ళింది—పెద్ద మంచంపై పరుండివున్న ఆయనను చూసింది.

ఆయనకు దగ్గరగా వెళ్ళి " నమస్కారం సార్ " అంది.

"నువ్వు వచ్చావని డాక్టర్ చెప్పారు. నిన్ను చూడా లనిపించింది. కబురంపాను. శ్రమ అనుకోకుండా వచ్చినందుకు సంతోషం"

"శ్రమ ఏమీ లేదు. ఇందాకనే నేను మీ దర్శనం చేద్దామనుకొన్నాను. కాని మందిచ్చానని, నిద్రపోతున్నారని డాక్టరుగారు చెప్పారు. నిద్ర పట్టడానికే మందిచ్చారేమో"

"నేను శారీరకంగానే గాక—మానసికంగాకూడా బాధ పడుతూంటే మందిచ్చినా నిద్ర ఎలా పట్టుతుంది?"

"మనస్సును కుదుట పరుచుకుంటే చికిత్సవల్ల శారీరక మైన అస్వస్థత తగ్గుతుంది. మనస్సును కలవరపెట్టుకోకండి. మీకు ఏం లోటు?"

"బ్యాంకులో లక్షలు మూలుగుతూవుంటే లోటు లేనట్లేనా? నీ పేరేమమ్మాయ్——"

"నవనీతం——"

"ఆహా! ఎంత చక్కని పేరు. నీ రూపానికి తగినట్లు వుంది. నీ పేరుకు తగినట్లే నీ హృదయంకూడా నవనీత సదృశ మైతే ధన్యులం"

"మనస్సును మనం స్వాధీనంలో అట్టేపెట్టుకోగలుగుతే ఏ వ్యధలూ దరిచేరవు. అహర్నిశలు మీకు సపర్య చెయ్య డానికి నేను సిద్ధంగా వున్నాను. ఏమి చెయ్యమంటారో చెబుతూవుంటే చాలు"

"సంతోషం ! ఒక్క ఉపకారం చేస్తేచాలు. చేస్తావా- వాగ్దానం చెయ్యి"

"తప్పకుండా చేస్తాను. మీ సేవలో ప్రాణమైనా ధార పోస్తాను. నర్సుకు—రోగిసేవే—దైవసేవ."

"మంచిమాట—విను. నేను భుజించే ఆహారం నేను త్రాగే మందు—నీ చేతులమీదుగానే ఇక్కడకు రావాలి. మధ్యన మరెవరూ ఆ ఆహారాన్నికాని—మందునుకాని తాకకుండా చూడాలి"

ఆ మాటలు విని నవనీతం నిర్ఘాంతపోయింది. ఒకటి రెండు క్షణాలు ఆగి "అలాగే చూస్తాను" అంది.

రంగస్వామిగారి ముఖంలో, కళ్ళలో సంతృప్తి తోచింది.

"థాంక్స్. నాకు కావలసింది అదే"

"మళ్ళీ మందు ఎన్నిగంటలకు ఇవ్వాలో చెబితే వచ్చి ఇస్తాను"

"వద్దు. అవసరమైతే స్వామి ఇస్తాడు. నువ్వు చాలా బడలివుంటావు. పోయి నిద్రపో"

నవనీతం తిరిగి తన గదిలోనికి వచ్చి పడుకొంది కాని చాలసేపటివరకు ఆమెకు నిద్ర పట్టలేదు.

ఆహారం విషయంలో రంగస్వామిగారు ఎందుకు తన్ను పరీక్షించి ఇమ్మన్నాడా అని ఆలోచించింది. మరు

క్షణంలో ఆమె కళ్ళెదుట జయలక్ష్మి, పిదప డాక్టర్ శ్రీనివాసన్. తర్వాత తాను భోజనసమయంలో డాక్టర్ వంక తదేకదృష్టితో చూడడం అన్నీ సినిమాలోని దృశ్యాల్లా పొడకట్టినవి.

"ఆయనను నాలాంటిది ప్రేమిస్తే ఏం చేస్తాడో— ప్రేమించానని చెబితే ఏమంటాడో" అని అనుకొంది. అలాంటి భావం కలగగానే ఆమెకు ఎందుకో చెప్పరాని సిగ్గు ముంచుకు వచ్చింది.

"అబ్బ! ఏమిటీ అవస్థ. నిద్రపట్టదా–" అనుకొంటూ కళ్లు మూసుకొనివుండగానే కిటికీలోనుంచి వీచిన చల్లగాలి— మెల్లగా జోకొట్టి, నిద్ర పుచ్చింది.

# 4

నవనీతం ఉదయాన లేచి, నర్సు యూనిఫారం ధరించి, ముందు తిన్నగా వంటగదిలోకి వెళ్ళి, రంగస్వామిగారికోసం తయారు చెయ్యవలసిన ఆహారం విషయమై వంటలక్కకు పురమాయించింది. ఆ ఆహారం తయారవుతూవుండగా తాను దగ్గర వుండి, స్వయంగా రంగస్వామిగారి దగ్గరకు తీసుకు వెళ్ళింది.

నవనీతాన్ని చూడగానే ఆయన "గుడ్ మార్నింగ్ నర్స్!" అన్నాడు.

ఆమె తనముందుంచిన ఆహారాన్ని పూర్తిగా ఆరగించి-"ఇన్నాళ్ళకు నేను తృప్తిగా భుజించాను" అన్నాడు. దాసీ పిల్ల ఆ కంచం, ప్లేటు తీసివేస్తూవుండగానే డాక్టర్ శ్రీనివాసన్ వచ్చి-"హల్లో! ఎలావుంది. మనపని" అని అడిగాడు.

"నిక్షేపంలా వుంది. రాత్రి బాగా నిద్రపోయా. ఇప్పుడే రొట్టె, పాలు తీసుకొన్నా"

"రైట్" అంటూ ఆయన ఒకసారి చెయ్యి చూసి, స్టెతస్కోప్‌తో గుండెలు పరీక్షించి బయటకు రాగానే నవనీతం కూడా వెళ్ళి—"ఒకమాట సార్" అంది.

"ఏమది?" అని డాక్టర్ ప్రశ్నించగా రాత్రి రంగ స్వామిగారు తనకు కబురంపిన వైనం వివరించి "నర్సును కనక ఈ సంగతి మీతో చెప్పడం విధివిహిత మనుకొన్నాను" అంది.

"విధివిహితమే. కాని..." అని డాక్టర్ శ్రీనివాసన్ ఆగిపోయాడు. అతని కళ్లు క్రోధంచే ఎర్రబారినవి.

"తన ఇంట్లోనే ఎవరో ఆ ఆహారంలో ఏ విషమో కలుపుతున్నారనిగాని, ఆయన అనుమానిస్తున్నాడా? ఈ అనుమానం ఎవరికి వర్తిస్తుందో ఊహించావా? శారీరకంగా మానసికంగా అస్వస్థులైనవారి మాటలను మనం ఎంతవరకు పరిగణించవచ్చునో తెలియదా? ఇటువంటి భ్రమవిభ్రాంతులు వారికి సహజం అని గ్రహించకపోతే ఎలాగ?"

"ఇవి అన్నీ నేను ఆలోచించలేదండీ. ఆయన రాత్రి నాకు కబురంపి, అన్న మాటలు—మీతో చెప్పడం నాకు విధి అని భావించాను. చెప్పాను. అంతకుమించి నే నేమీ ఊహించనూ లేదు. వ్యాఖ్యానించనూలేదు"

ఆ మాటలకు డాక్టర్ శ్రీనివాసన్ కొంచెం శాంతించాడు.

"అవునులే. ఆయన మూడేళ్ళనుంచి అలా పడివున్నాడమ్మో. ఏవో లేనిపోని అనుమానాలు కలగడంలో విచిత్రం ఏమీ లేదు. ఆయన ఏమంటే దానికి ఔనంటేనే సరిపోతుంది"

"అయితే ఆయనకు స్వాస్థ్యం కలిగే అవకాశం ఏ మాత్రమూ లేదా ?"

"ఉంటే—మేము ఊరుకొంటామా నర్స్. ఎంతమంది స్పెషలిస్టులను పిలిపించాను ? ఎంత డబ్బు ఖర్చయింది. నేను ఆయన బాల్య స్నేహితులం. సహాధ్యాయులం. ఇది నిజంగా ఆయన దురదృష్టంకాదు. మా అందరిదీని" అంటూ వుండగా డాక్టర్ శ్రీనివాసన్ కంఠం గాద్గద్యం వహించింది.

అది చూడగానే నవనీతం శరీరం గగుర్పొడిచింది.

"పాపం..." అన్న మాట అప్రయత్నంగా ఆమెనోట వెలువడింది. డాక్టర్ ఆమె ఒకరివంక ఒకరు చూచుకొన్నారు. తనయెడల మొదట్లో కనిపించిన చిరాకు, విముఖత్వం, ఏవగింపు పూర్తిగా తొలగిపోయినవనే నమ్మకం ఆమెకు కలిగింది. ఆమె హృదయాంతరాళంలో ఎందుకో - ఏమో తెలియని కలవరం రేగింది. ఆమె గుండెలు మహావేగంగా కొట్టుకొన్నాయి.

"అమ్మగారు ఒకసారి అలావచ్చి మరీ వెళ్లమన్నారు" అంది—దాసీపిల్ల.

డాక్టర్ శ్రీనివాసన్ ఆ పిల్లతోకూడా అలా వెళ్లాడు.

# 5

హృదయంలో కలిగిన ఆ వేగం ఇంకా ఆమెకు తగ్గనేలేదు. ఆమె చరచర మేడమీది తన గదిలోకి వెళ్లి గుండెలపై చెయ్యి వేసుకొని " అబ్బా " అంటూ ఒక దీర్ఘనిశ్వాసం విడిచింది.

" నీవంటి అందకత్తె అవసరం లేదనీ, తన అందం వల్ల మనస్సు చెడుతుందేమో అని స్పష్టంగా సూచించిన డాక్టర్ శ్రీనివాసన్ నుచూడగానే, అతనితో మాట్లాడగానే తన మనస్సులో ఇంత ఉద్రేకం, ఇంత ఉద్వేగం కలగడం దేనికి? నిజానికి అతడు అందగాడు కాడే. డాక్టర్ సీతారామ్‌తో పోల్చ డానికైనా అవకాశం లేదే. ఏమిటి అతనంటే ఈ ఆకర్షణ ? ఇప్పటికీ నా మనస్సు డాక్టర్ సీతారామ్ కోసమే పరితపిస్తూ వుందే - తప్పుకాదూ. ఆయన ఇప్పుడు నాకు బావ కాదూ ? అక్కకు ద్రోహం చెయ్యవచ్చా ? కూడదు. ఎలాగైనా ఆయన స్వరూపాన్ని మనస్సునుంచి తొలగించాలి. ఆ స్థానాన్ని కొంపతీసి - డాక్టర్ శ్రీనివాసన్ ఆక్రమించుకోడుగదా. ఛీ ! ఏమిటి పిచ్చి ఊహాలు "అనుకొంటూనే ఆమె క్రిందకు వెళ్లింది.

రంగస్వామిగారితో సరదాగా కాస్సేపు ఆ కబురూ, ఈ కబురూ చెప్పి నవ్వించింది.

ఈ విధంగా రోజులు గడచిపోసాగినై. నవనీతానికి రంగస్వామిగారికి సపర్య చెయ్యడంలో కష్టమేమీ తోచలేదు. ఆసుపత్రిలోవలెగాక ఇక్కడ ఆమెకు ఎంతో తీరిక వుంది.

ఇలా వుండగా ఒకనాటి ఉదయం మేడమీది తన గదిలోనుంచి జయలక్ష్మి ఆమెకు కబురంపింది. రంగస్వామి గారు నిద్రపోతున్నారని తెలుసుకొని-తనదగ్గర కూర్చోమంది.

మదరాసును గురించి ఏవేవో ప్రశ్నలు అడుగగా, నవనీతం సమాధానాలు చెబుతున్న సమయంలోనే డాక్టర్ శ్రీనివాసన్ వచ్చాడు.

"రండి డాక్టర్ గారూ. కూర్చోండి" అంది జయలక్ష్మి.

"చాలాసేపైంది. పోతాను" అంటూనే డాక్టర్ అక్కడవున్న కుర్చీలో కూర్చున్నాడు.

ఈలోగా నవనీతం ఆ గది కిటికీదగ్గర నిలబడి బయట ఒక ఫర్లాంగ్ దూరంలో ఒక కొండనుంచి పడుతున్న జలపాతాన్ని తదేకదృష్టితో చూసి "ఆహా! ఎంత మనోహరమైన దృశ్యం!" అంది.

"బాగాలేదూ?" అంది జయలక్ష్మి.

"ఎంతో బాగుంది. ఇటువంటి దృశ్యాలు ఇంత మనోజ్ఞమైన ప్రకృతి సౌందర్యంచూసి, ఆనందించడానికి పెట్టి పుట్టాలి. ఎంత అదృష్టవంతురాలివమ్మా—" అంది.

అమాయకంగా అలా అన్నదేకాని ఆ మాటలు జయలక్ష్మికి ఎంత తీవ్రమైన వ్యధను కలిగిస్తాయో ఊహించ లేక పోయింది.

"అదృష్టమా?" అంది జయలక్ష్మి. ఆ క్షణంలోనే ఆమె ముఖం వెలవెలపోయింది. కళ్లు భాష్పానిలములై పోయినవి. ఇక ఆగలేక ఆ గది బయటకు వెళ్ళిపోయింది.

"అయ్యో! ఎంత తెలివిమాలినదాన్నో, ఆ మాట అనడానికి. ఈ సౌందర్యశోభను చూస్తే—అందులోను దేవత లాంటి ఆమె మనస్సుకు ఎంత ఆహ్లాదం కలుగుతుందో అని అన్నానే కాని రంగస్వామిగారి అస్వస్థత కారణంగా ఆమె మనస్సు దుఃఖభాజనమైపోయి వుందని, ఆమె ఆనందానికి దూరమై కృంగిపోయి వుందని ఊహించలేక పోయాను" అంది నవనీతం డాక్టర్‌తో.

డాక్టర్—"మరేం తప్పులేదు. కాని, ఆమెకు అది కష్టం కలిగిస్తుందేమో అని ఊహించివుండవలసింది" అన్నాడు.

"ఏదో అప్రయత్నంగా అనేశాను కాని, నిజానికి నేను ఎప్పుడూ ఎవరితోనైనా జాగ్రత్తగానే మాట్లాడతాను."

"తెలుసు. కనకనే నువ్వంటే రంగస్వామిగారికి జయలక్ష్మికి ఇష్టం. నౌకరు స్వామి నిన్ను దేవత అనే పిలుస్తాడామె. వంటలక్క "ఎంత మంచి పిల్లనుకొన్నారు?" అంటున్నది. ఇంక నీకేంలోటు?" అని డాక్టర్ శ్రీనివాసన్ అన్నాడు.

"మీ మాట చెప్పరేం" అందామన్న ప్రశ్న ఆమెకు నోటిదాక వచ్చింది. కాని, అక్కడతోనే ఆగిపోయింది. ఆ మాట తాను అనకూడదనుకొంది.

"అయితే కొన్నాళ్ళపాటు ఇక్కడ నేను వుండవచ్చునా?" అని అడిగింది.

"ఉండవచ్చు కాని ..."

"కాని ఏమి ? ఇంత చక్కని స్థలంలో వుండడం ఎవరికి సంతోషం కాదు ?"

"కావచ్చు కాని, నీవంటి వయస్సులో వున్న పిల్ల పట్నంలోని ఆసుపత్రిలో స్వజనంమధ్య మసలుతూ వుండకుండా ఇటువంటి జనం తక్కువ స్థలంలో వుండడానికి మోజు పడడం విరుద్ధమే. అయితే దానికి ఏదో ప్రబలమైన కారణం వుండవచ్చు"

"అంటే—"

"అంటే మరేమీ లేదు. నేనైనా అది ఇది అని నిశ్చయంగా చెప్పలేను. "మనస్సుకు ఏదో కష్టం కలిగించదగు సంఘటన జరిగివుండాలి. ఆ సంఘటన ప్రేమకు సంబంధించినదై వుండాలి. అప్పుడే ఆ హృదయానికి ఇటువంటి ఏకాంతస్థలాన నివసించాలనేకోరిక కలుగుతుంది."

నవనీతం తన రిచ్చపాటును కప్పిపుచ్చుకొనడానికి యత్నిస్తూ, "అబ్బే ! అటువంటిది ఏమీ లేదు" అంది.

"కావచ్చు. ఉన్నా నేను తరచి అడిగే తరహావాణ్ణి కాను. నువ్వు ఇక్కడ వుంటాననడమే మాకు పదివేలు. జయలక్ష్మి హృదయం చాలా సున్నితమయింది. మూడు సంవత్సరాల క్రితం రంగస్వామిగారికి జరిగిన ప్రమాదానికి తానే బాధ్యురాలనని ఇప్పటికీ ఆమె బాధపడి ఏడుస్తున్నది.

ఆ రోజున ఆమె సరస్సు దగ్గరకు షికారు వెళ్ళిన సమయంలో ఆయన గుర్రంమీద స్వారిచేస్తూ రాగా - ఈ కొండలమీద గుర్రపుస్వారి ప్రమాదకరంకాదా అని అడిగిందట. చేతకాని వాడికి ఎక్కడైనా ప్రమాదమే అని ఆయనంటే—"ఏదీ - అలాఅయితే ఆ గుట్టకు చుట్టిరండి" అందట. దానిమీద హుషారుగా గుర్రాన్ని పరుగెత్తిస్తే - అది కాలికి ఏ రాయో రప్పో తగిలి - క్రింద పడవేసింది. తాను ఆనాడు అలా అని వుండకపోతే ఈ ప్రమాదం సంభవించివుండేది కాదుకదా అని ఇప్పటికీ ఆమె ఒక్కొక్కపుడు ఎంతో పరితపిస్తూ వుంటుంది"

"పాపం...అయితే అటువంటి ప్రమాదం ఎవరికైనా సంభవించవచ్చు. దీనికి ఆమెను నిష్ఠూరమాడవలసిన పనిలేదు"

"సరే. నేను పోతాను. ఎప్పుడైనా అవసరమైతే నా డిస్పెన్సరీకి స్వామిని పంపిస్తూవుండు. రెండు మూడు రోజులలో ఒకసారి నాతోపాటు డిస్పెన్సరీకి వచ్చి, లేబరేటరీని చూద్దువుగాని"

"సంతోషం" అంది నవనీతం.

డిస్పెన్సరీని, లేబరేటరీని చూడడానికి తీసుకువెడతా నంటే ఆమె మనస్సు ఎందుకో సంతోషంతో ఉప్పొంగింది.

"నేను సమర్థత కల నర్సునని ఆయన ఒప్పుకొన్నాడు. అదేచాలు" ననుకొంటూ నవనీతం రంగస్వామిదగ్గర కాస్సేపు కూర్చుని డాక్టర్ శ్రీనివాసన్‌కు తనకు మధ్య జరిగిన సంభాషణను గురించే తలచుకొంటూ తనగదిలోనికి వెళ్ళింది.

# 6

ప్రతిరోజు నవనీతానికి మధ్యాహ్నం ఒంటిగంటనుంచి సాయంకాలం నాలుగు గంటలవరకు డ్యూటీలేదు. ఆ సమయంలో ఆమె తన ఇచ్ఛవచ్చినచోటుకు వెళ్ళవచ్చు.

ఈ వ్యవధిలో నవనీతం పట్టణంలోకి వెళ్ళి తనకు కావలసిన వస్తుసామగ్రిని కొనుక్కొంటూ వుండేది.

"కారుమీద వెళ్లు నవనీతం!" అని జయలక్ష్మి ఒకటి రెండుసార్లు అంది. కాని ఆమె "అక్కా! కాస్సేపు నడిస్తేనే సరదాగా వుంటుంది. ఎండా ఏమన్నానా?" అనేది.

ఒకనాడు వస్త్రాల దుకాణానికి వెళ్ళి—ఒక చీర కొనుక్కొని వస్తూ మోడల్ లంచ్ హోమ్ దగ్గర —"ఫలహారం చేద్దునా" అని ఆలోచించుకొంటూ వుండగా వెనకనుంచి "నవనీతం" అని ఎవరో పిలిచినట్లయింది.

ఆమె వెనుదిరిగి చూచింది. "ఓహో! శివభాగ్యం! ఎన్నాళ్ళకు కలుసుకున్నాం! రా. ఈ హోటల్లో కాస్త కాఫీ త్రాగుదాం" అంటూ తీసుకువెళ్ళింది.

"నువ్వెప్పుడు వచ్చావు?" అని అడిగిందామె.

"నేనా! పదాదినుంచి ఇక్కడనే వున్నాను ఆసుపత్రిలో నర్సుగా. డాక్టర్ శ్రీనివాసన్ చెప్పారు—నువ్వు వచ్చావని. అయితే మనం ఇద్దరం స్నేహితులమని ఆయనతో చెప్పలేదు. నేనే ఒకసారి అటు వద్దామని వారంరోజులనుంచి ప్రయత్నిస్తూవుంటే ఎప్పటికప్పుడే ఏదో ఒక ప్రతిబంధకం సంభవిస్తూవుంది. జయలక్ష్మి నిన్ను బాగా చూస్తుందా?"

"ఆహా! ఎంతో దయగా మాట్లాడుతుంది. ఆదరణకు లోపంలేదు"

"అంతా బాగానేవుంది కాని అయిదవతనమే కొంచెం తక్కువ' అన్నట్లుంది నీ మాట. అందంలో ఆవిడకు ఎవరూ సాటిరారు. కాని మంచిది కాదంటారు అంతాను. అయినా మన కెందుకులే వల్లమాలిన విషయం"

"మంచి అంటే—"

"స్వభావం! మొగుడు—రంగస్వామిగారు దేముడు అంటే నమ్ము. ఆయనను నేను బాగా ఎరుగుదును. చాలా సార్లు వారి ఇంటికి వెళ్లి పరిచర్యచేశానుకూడా. అయితే ఆయనంటే నాకు ఎంత గౌరవమో ఆవిడంటే అంత ఒళ్లుమంట. నిజం దేముడికి తెలియాలి కాని—ఆవిడే భర్త గుర్రంమీద స్వారీ చేస్తూవుంటే పడవేసిందనో, పడవేయించిందనో అంటారు"

"అసంభవం. ఆయనతోపాటు కూడా పరుగెత్తిందంటావా ఆయన స్వారీ చేసినపుడు?"

"ఆసంగతి డాక్టర్ శ్రీనివాసన్ కే తెలియాలి."

" ఈ ప్రమాదం జరిగినప్పుడు ఆయన యుద్ధంలోకి వెళ్లాడట్గా "

" వెడితేనేం ?—ఆ తర్వాత రాలేదూ ? "

" నాకు నీమాటలు వింటే తల తిరిగిపోతోంది "

" అవునులే. ఆవిడగారి చర్యలు నీకు స్వయంగా కంటబడితేనేగాని తెలియదు తత్వం. అదుగో—ఆయన వస్తున్నాడు"

" ఆయన అంటే ? "

" మా ఆయన. గోపాలన్. నేను నర్సుగా ట్రెయినింగ్ కావడానికి ముందే యుద్ధపు సర్వీసుకు వెళ్లాడు. తిరిగి వచ్చే సరికి నన్ను ఇక్కడ పోస్ట్ చేశారు. యుద్ధంనుంచి తిరిగి వచ్చిన తర్వాతనేగా మాకు పెళ్ళి అవుతా "

శివభాగ్యం తన భర్తను నవనీతానికి, నవనీతాన్ని తన భర్తకు పరిచయం చేసింది.

" మా ఆవిడ చెప్పింది మీ మాట. వెళ్ళి చూసివద్దామని పదిసారులు అన్నాను. అయితే మీకు అక్కడ దానికి ఈ ఆసుపత్రిలోను డ్యూటీతోనే తీరిపోతుంది. రేపు సాయంత్రం టౌన్ హాలులో " డాన్స్ " వుంది వస్తారా ? "

" అమ్మో ! నాకు డ్యూటీవేళ "

" అయినా ఫర్వాలేదు. రంగస్వామిగారు నిద్రపోవడానికి డాక్టర్ శ్రీనివాసన్ ఏదో మందిస్తాడు ? ఆ మందు పని చేసినా మానినా, జయలక్ష్మమ్మగారు దానిలో కలిపే మూలికా రసాయనమైనా పనిచేస్తుంది " అన్నాడు గోపాలన్.

" మూలికలా "

" ఈ కొండలమీద ఎలాంటి దివ్యమైన ఓషధు లున్నాయో? సరస్సు పడమటి గట్టునలేదూ – అలమేలు! ఆవిడ తయారుచేసి ఇస్తుంది. రకరకాల రసాయనాలు. కుక్కకాటు నుంచి చెప్పుదెబ్బ వరకు ఎన్నిరకాల రసాయనాలైనా దొరుకుతాయి " అన్నది శివభాగ్యం నవ్వుతూ.

ఇంతలో డాక్టర్ శ్రీనివాసన్ కారు ఆగిందక్కడ.

ఆయన లోపలకువచ్చి ఒక టేబుల్ దగ్గర కూర్చున్న వీరు ముగ్గురిని చూచి—అరె! ఏమిటీ విచిత్రం అన్నాడు.

" ఈ ఊళ్లో జరుగుతున్న చిత్రాలకంటె కూడా ఇది విచిత్రమా? " అంది శివభాగ్యం.

" కాదు. నీకంటె విచిత్రం " అంటూ డాక్టర్ శ్రీనివాసన్ కూడా ఆ టేబుల్ దగ్గరనే కూర్చుని కాఫీ త్రాగుతూ " రేపు ఏదో డాన్సు పెట్టించావే " అన్నాడు శివభాగ్యాన్ని చూచి.

" అవును—నేనేగా పెట్టించింది. నేను మా ఆయన నృత్యం చేస్తాం. అయితే ఏమండీ నవనీతాన్ని పంపరూ? "

" నేనా పంపవలసినవాణ్ణి. రంగస్వామిగారితోనైనా జయలక్ష్మితోనైనా చెబితేసరి వాళ్లే వెళ్ళమంటారు. "

" మరి మీరుకూడా రావాలి. "

" అది వేరేమాట. ముందు నీ నేస్తంసంగతి తేల్చు. మంచిపిల్ల. రంగస్వామిగారి అదృష్టంకొద్దీ దొరికింది— "

"పోనీ నర్సు విషయంలోనైనా ఆయనకు అదృష్టం వుంది నయం" అంది శివభాగ్యం.

ఆ మాటలలోని ఆంతర్యం స్ఫురించినంతనే డాక్టర్ శ్రీనివాసన్ కళ్ళు క్రోధంతో జేవురించాయి.

"లోకంలో మనుష్యుల స్వభావాలు రకరకాలుగా వుంటాయి. ఒకళ్ళలోని గుణాన్ని మరొకరు సులభంగా గ్రహించలేరు. తప్పుల్నిమాత్రం సులభంగా ఎంచుతారు"

"మనవాళ్ళలోనూ వుంది ఆ గుణం" అన్నాడు గోపాలన్.

"నిజమే. కాని మనవంటివాళ్ళకుమాత్రం ఈ తప్పొప్పుల ఎన్నిక తగనిపని. మనం సాధించవలసిన లక్ష్యాలే వేరు. నాకు పనివుంది. పోయివస్తాను" అంటూ డాక్టర్ శ్రీనివాసన్ వెళ్ళిపోయాడు.

"నర్సు విషయంలోనైనా అదృష్టవంతుడే అని అన్నందుకు కాబోలు అయ్యకు కోపం వచ్చింది. వస్తే రానీ. నాకేం భయమా? కొన్నాళ్లు అలా చూస్తూ వుంటు. నువ్వు ఎటువంటి విపరీతపు పరిస్థితుల్లో పడతావో ఈ కళ్లకి రెప్పలు దూరం కావుకదా. అన్నీ నేను చూడకపోతానా?" అంది శివభాగ్యం.

ఆమెతోను. గోపాలన్‌తోను చెప్పి, నవనీతం బసకు వెళ్ళింది. రంగస్వామిగారితో తాను శివభాగ్యాన్ని కలుసు

కొన్నానని—మొననాటి సాయంకాలం టౌన్ హాలులో జాన్సు వృందమే చెప్పింది.

"నువ్వు వెళ్ళి చూసిరా అమ్మా" అన్నాడాయన.

"మీకు ఇక్కడ మందు ఇవ్వనవద్దా"

"ఇచ్చి వెళ్ళు. ఆ తర్వాత అవసరమైతే స్వామి ఇస్తాడు___"

ఆ సాయంకాలం ఆమె జయలక్ష్మిని చూడలేదు. ఆమెకు తలనొప్పిగావుంది. పడుకొన్నదని వంటలక్క చెప్పింది.

నవనీతం ఒక్కతె భోజనం చేసింది. ఆ తర్వాత మరి కాస్సేపు రంగస్వామిగారి దగ్గర కూర్చుని తన గదికి వెళ్ళింది.

—"డాక్టర్ శ్రీనివాసన్ కూడా వెళ్ళమన్నాడు. ఒకొక్క సమయంలో ఆ ముఖంలో నవ్వు—హృదయంలో వికాసాన్ని ప్రతిబింబిస్తుంది. మరొక సమయంలో ఆ కళ్ళలో పైశాచికత్వం ప్రతిఫలిస్తుంది. ఏమిటి ఆయనలోని ఈ భిన్న స్వభావం? నా మనస్సులోనుంచి డాక్టర్ సీతారామ్ ప్రతిమ తొలగిపోతోంది. కొంపతీసి శ్రీనివాసన్ స్వరూపంగాని ఆ స్థానం ఆక్రమించుకోడుగదా! అబ్బా! ఎందుకు నా మనస్సుకు ఈ వెర్రికోరికె—ఎందుకు అర్థంలేని ఈ అడియాస?" అనుకొంది.

ఏవేవో ఆలోచనలు పరంపరగా ఆమె హృదయాంబర వీధిని పరుగిడుతున్నాయి.

హాలులోని గోడ గడియారం టంగు టంగుమని పది గంటలు కొట్టినప్పుడుగాని ఆమె ఆలోచనల కంతరాయం కలగ లేదు.

"ఎంతసేపటికి నిద్రనట్టదు. పోనీ ఓసారి వెళ్లి రంగ స్వామిగారిని చూసివత్తునా ?" అనుకొంది.

మెల్లగా లేచి తలుపు తెరిచి మేడమెట్లు దిగుతూ క్రింది హాలునుంచి ఎవరో వెక్కి వెక్కి ఏడుస్తున్న సవ్వడి కాగా ఆగి, అతిమెల్లగా మరిరెండు మెట్లు క్రిందికి దిగి తొంగిచూసింది.

డాక్టర్ శ్రీనివాసన్ నిలబడివున్నాడు. ఆయన వక్షస్థలంపైన తల ఆనుకొని జయలక్ష్మి—ఏడుస్తూ—"ఈ వ్యథ నేను సహించలేను" అంటూ వుంది.

డాక్టర్ "నీకేం భయంలేదు. బెంగపెట్టుకోకు" అంటూ ఆమె వీపు నిమురుతూ బుజ్జగిస్తున్నాడు. నవనీతం ఇక అక్కడ నిలవలేకపోయింది. మెల్లగా తన గదిలోకి వెళ్ళి తలుపు వేసుకొని వలవల ఏడ్చింది—

ఆతర్వాత – "ఎందుకు నేను ఏడ్వడం ? ఆమెఅంటే డాక్టర్కు ఇష్టం వుండవచ్చు. మోజు వుండవచ్చు. కాని ప్రేమ వుంటుందని నేను అనుకోను" అని ఆమె తలపోసింది.

అయితే ఆమె మనస్సులో ప్రచండమైన తుపాను రేగుతూనేవుంది.

# 7

డాక్టర్ శ్రీనివాసన్ ఎడల అంతకుముందున్న గౌరవం—ఆకర్షణ ఒక్కసారిగా నర్సు నవనీతం మనస్సునుంచి తొలగిపోయాయి.

నిజమే. తొలగిపోవూ? తన్ను ఆప్తునిగా ప్రాణమిత్రునిగా నమ్మి, మంచానపడి ఆరోగ్యంకోసం తపిస్తున్న రంగస్వామిగారి ఇంట రాత్రి పదిన్నరకు—ఆ సమయంలో ప్రవేశించి, ఆయన భార్యతో సరాగాలు ఆడడం ఘోరంకాదూ? తనపట్ల రోగి పెట్టుకొన్న విశ్వాసాన్ని ఈ విధంగా భంగపుచ్చి, ద్రోహం తలపెట్టడం ఏ డాక్టరుకైనా అక్రమంకాదూ?

కొంతమంది స్త్రీలు రోగగ్రసితలై బాధపడుతున్నపుడు తమకు మందిచ్చిన డాక్టర్ పట్ల అభిమానం కలిగివుంటారు. అది సహజం. కొంతమంది ప్రేమిస్తారుకూడా. అది సహజమే గాని, తమయెడల ఎంతో శ్రద్ధ, ఆసక్తి వెలిబుచ్చుతున్న డాక్టరును అపార్థం చేసుకొని, తాత్కాలికంగా ఏదో భావోద్రేకానికి లోనై ప్రేమించే స్త్రీలువున్నా. ఆ డాక్టరులు దానికి తమలోతామే నవ్వుకొని, ఆ ప్రేమను, ఆఅభిమానాన్ని సహృదయంతో రోగి రోగ నివృత్తితో స్వస్తిచెప్పి తమ జీవిత వృత్తిలో నిమగ్నులౌతూవుంటారు.

ఎక్కడో నూటికి, కోటికి ఒకరుగాని అటువంటి ప్రేమకు దాసులుకారు.

తెల్లవారగానే సామాను సర్దుకొని మదరాసు పోదామనుకొంది నవనీతం. కాని రంగస్వామిగారి విషణ్ణముఖం ఆమె మనోవీథిని వెంటనే పొడకట్టింది. తాను వచ్చిననాటిరాత్రే కబురంపి, తన ఆహారాన్ని మందును జాగ్రత్తగా చూసి అందజేయవలసిందని ప్రాధేయ పూర్వకంగా ఆయన అడిగిన మాటలు ఆమె హృదయకుహరంలో ఇంకా ప్రతిధ్వనిస్తూనే వున్నాయి. ఆయనను అలా వదిలివేసి వెళ్ళిపోవడం తన నర్సు వృత్తికే తగనిపని.

తన ప్రేమకు భాజనుడై తనకు ఆశాభంగం కలిగించిన డాక్టర్ సీతారామ్ స్వరూపాన్ని మనఃఫలకంనుంచి తొలగించి వేయాలని ఆమె ఎంతో ప్రయత్నించింది. అందులో చాలా మట్టుకు కృతకృత్యురాలయిందికూడా. అయితే ఆ స్థానాన్ని తనకు తెలియకుండానే డాక్టర్ శ్రీనివాసన్ ఆక్రమించుకున్నాడు. ఇప్పుడతని స్వరూపాన్నికూడా హృదయంనుంచి తొలగించడం అంత కష్టంకాదనుకొంది.

ఇంతలోనే ఒక్కఊపున తలుపు త్రోసుకొని జయలక్ష్మి లోపలకు వచ్చింది. ఆమెను చూసి నవనీతం సగౌరవంగా లేచి నిలబడ్డది.

" నువ్వు ఇందాక క్రిందకు రాబోయి, మెట్లమీద ఆగి, మళ్ళీ లోపలికే వెళ్ళిపోయావేం ? "

" నిద్రపట్టక—ఒకసారి రంగస్వామిగారిని చూసివద్దామని కిందకు పోబోయాను "

" ఎందుకు క్రిందకు దిగలేదు "

" హాలులో మీరు డాక్టరుగారు కనిపించడంతో అటు రావడం మర్యాదకాదని తిరిగి నా గదికి వచ్చేశాను "

" సమాధానం బాగానేవుంది. కాని ఇది నీకు తగదు. డాక్టర్ వంక ఆప్యాయంగా కళ్ళనిండా, అంత లింతలు చేసుకొని కులుకుతూ చూడ్డం మాను. నేను ఏం చేస్తున్నానో అని రహస్యంగా పొంచి చూడ్డంకూడా కట్టిపెట్టు. నామీద ఊళ్లోవాళ్ళతో కలిసి గుసగుసలాడ్డం నీకు తగదు. నువ్వు నా సంగతి సందర్భాలు కనిపెట్టడానికి రాలేదు. ఆయన సపర్య కోసం వచ్చావు. నీపని నువ్వు చూచుకొంటే మాకు ఎంతైనా ఉపకారం చేసినదానవౌతావు "

" సరేనమ్మా " అంది నవనీతం మెల్లగా.

జయలక్ష్మి తటాలున ఆ గదినుంచి బయటకు వెళ్ళి, ఉత్తరక్షణంలోనే తలుపు తెరిచి, " నువ్వు ఇప్పుడు చూసిన విషయం ఆయనతో చెబుతావనుకుంటాను " అంది.

" నేను నర్సును, నేను జీతానికి పని చెయ్యడానికే ఇక్కడకు వచ్చాను. కాని మీ భర్తచే మీకు విడాకులిప్పించ

డానికి కాని, ఆ సందర్భాన కోర్టులో సాక్ష్యం ఇవ్వడానికికాని రాలేదు. మీకు డాక్టర్ శ్రీనివాసన్‌కు మధ్య ఏమైనా గొడవవుంటే దానితో నాకేమీ నిమిత్తంలేదు. నేను వచ్చినది ఆయన సపర్యకోసం. మందులివ్వడానికి వచ్చిన డాక్టర్‌తో తన భార్య సరాగాలాడుతూ వున్నట్లు తెలుసుకొనడంవల్ల ఆయనరోగం మరింత ముదరగలదేకాని తగ్గదుకదా"

ఆ మాటలకు జయలక్ష్మి ముఖం వెల్లనై పోయింది.

నాకు డాక్టర్‌గారికిమధ్య ఏ గొడవాలేదు. ఆదరణగా మాట్లాడుతారు. కనక ఆయనంటే అభిమానం, చనువూను. అంతేకాని నాకు-ఆయనకు ..." అని ఆ వాక్యాన్ని పూర్తి చెయ్యలేకపోయింది. ఆమె ఫిట్ వచ్చి పడిపోతుందేమో అని భయపడి నవనీతం చెయ్యిపట్టుకుని—"ఏమిటీ రభస చెప్పండి. లేనిపోని సందేహాలు పెట్టుకుని మనస్సు పాడుచేసుకోవడం గాని. రండి. మీ గదిలోకి తీసుకువెడతాను. చక్కగా పడుకొని నిద్రపోండి" అంటూ మెల్లగా ఆమెను గదిలోకి తీసుకువెళ్ళి పరుండబెట్టి, ఆ సాయంకాలం తలనొప్పితో బాధపడుతున్నట్లు వింది కనక తలనొప్పి తగ్గడానికి డాక్టర్ శ్రీనివాసన్ ఇచ్చిన మాత్రనిచ్చి, కాసిని నీళ్లు త్రాగించి "ఇక నే పోనా!" అంది నవనీతం.

"అనవసరంగా నీ మీద కేకలువేశాను. దుర్భాషలాడాను. నన్ను క్షమించు నవనీతం" అంది జయలక్ష్మి.

"దీనిలో క్షమించవలసిన పని లేదు. ఇంట్లో అరడజను మంది నౌకరు లున్నారు. పైగా స్వామి రాత్రి పగలుకూడా ఆయన పరిచర్యకోసం మేలుకునే వుంటాడయ్యె. ఎవరు చూసినా రంగస్వామిగారిదాకా ఈ సంగతి పోక మానదు. ఇది అవివేకపు పని కాదంటారా ?" అంది నవనీతం.

"అవివేకపుపని అని అనడానికైనా, అనుకోడానికైనా మేము ఏమైనా తప్పుచేస్తేగా. మామూలుగా స్నేహంగా వుండడంలో దోషం ఏముంది ?"

ఒకటి రెండు క్షణాలు ఆగి "సరే. నేను డాక్టరును ప్రేమించాను. ఆయన నన్ను ప్రేమించాడు. నీకు నిజం చెప్పేశాను. ఏం చేస్తావో చెయ్యి" అంది జయలక్ష్మి ఉద్రేకంతో.

"ఏమీ చెయ్యను" అంటూ లైటు ఆర్పివేసి, నవనీతం తన గదిలోకి చకచక పోయింది.

# 8

మరునాటి ఉదయం నవనీతం రంగస్వామిగారిగదిలో వుండగా డాక్టర్ శ్రీనివాసన్ వస్తూనే "గుడ్ మార్నింగ్ నర్సు" అన్నాడు.

"గుడ్ మార్నింగ్ సార్" అంది నవనీతం ఆయనవంక చూడకుండా ముభావంగా.

అది కనిపెట్టి డాక్టర్ ఆమెవంక మరొకసారి చూశాడు.

"ఏమండీ! స్వాములు! మన వ్యవహారం ఎలావుంది?" అని అడిగాడు రంగస్వామిగారినిచూచి.

"అద్భుతంగా వుంది. రాత్రి ఏ మందూ డ్రింగ్ నక్కరలేకుండానే చక్కగా నిద్రపట్టింది"

"మందు అక్కరలేకుండా నిద్రపట్టిందనే శుభవార్త కోసం ఎన్నాళ్ళనుంచో వేచివున్నాను. అయితే ఆయన రాత్రి భోజనం చేశారా! నర్స్!" అని డాక్టర్ శ్రీనివాసన్ ప్రశ్నించగా, "సుష్టుగా భోజనం చేశారు" అంది.

"బాగానే వుంది" అంటూ, రోగి కాళ్ళదిక్కున మంచంకొయ్యకు తగిలించబడివున్న చార్టును ఒకసారి పరీక్షించి హాలులోకి వెళ్ళిపోతూ డాక్టర్ శ్రీనివాసన్ నవనీతాన్నిచూచి అటు రావలసినదిగా సంజ్ఞ చేశాడు.

ఆమె దగ్గరకు రాగానే "ఏమండి నవనీతంగారూ! ఇవాళ అలా ముభావంగా వుంటూ ముక్తసరిగా మూడే మాటలలో సమాధానమిస్తున్నారు. నిన్న హోటల్ దగ్గర కనిపించినప్పుడు అనుగ్రహించిన మందహాసానికైనా నేను నోచుకోనకపోయానా? నిజంగా మనం స్నేహితులం కాగలమనే నేను ఆశించానే"

"నేను ఇక్కడకు వచ్చినరోజున స్టేషన్‌లో అలా మండిపడ్డారే మరి" అంది నవనీతం.

"అది నా తప్పే. ఆ తప్పును క్షమించమని ఏదో ఒక సమయంలో నిన్ను కోరుదామనికూడా అనుకొంటున్నాను. మదరాస్‌నుంచి నర్సును రప్పించాలని అనుకొన్నప్పుడే, నడి వయస్సులో నున్న నర్సు అయితే సరిపోతుందనుకొన్నాము. ఆ తర్వాత మోరిసన్ ఆసుపత్రి సూపరెన్టెంట్ ఉత్తరం చూసి, ఆయన సిఫారసు బలంగావుండడంవల్ల నిన్ను రప్పించాం. తీరా స్టేషన్‌కు వస్తే పదిహేనేళ్ళ పిల్లలా నువ్వు కనిపించడంతో— చేతావాతా కాక కబుర్లతోను, కథలతోను కాలక్షేపం చేసే రకం అనుకొన్నాను. కాని, ఇప్పుడాఉద్దేశం మార్చుకొన్నాను. ...ఇవాళ రాత్రి డాన్సు వుందికదూ. అక్కడకు వెళ్ళినపుడు సరదాగా మాట్లాడవచ్చునని ఆశించానుకూడా."

"ప్రదర్శన ప్రోగ్రాంకు స్వస్తి చెప్పవలసివచ్చింది. అక్కడకు వెళ్లాలని నాకు లేదు"

"పోనీ, లేకపోవచ్చు కాని అకస్మాత్తుగా నాపైన ఈ ద్వేషం ముభావం దేనికి?"

"మీమీద ద్వేషంలేదు కాని నిజంగా నా మనస్సు ఒక విషయానికి వికలమయింది. తన్ను నమ్మిన రోగి భార్యను రహస్యంగా ప్రేమించే డాక్టర్లంటే నాకు సరిపడదు"

ఆ మాట వినగానే డాక్టర్ శ్రీనివాసన్ ముఖం ముడుచుకుపోయింది. కళ్ళలో క్రుద్ధత్వం ప్రతిఫలించింది.

"ఓహో! అదా నీ ముభావానికి కారణం!" అంటూ డాక్టర్ శ్రీనివాసన్ విసవిస చక్కాపోయాడు.

మరి రెండు నిమిషాలకల్లా ఆయన కారు బయలుదేరి వెళ్ళిన శబ్దం వినిపించింది.

తను ఆయన ముఖంమీద ఆలా అన్నందుకు నవనీతం పశ్చాత్తాపపడలేదు. తాను అబద్దం ఆడలేదు. లేనిదేమీ కల్పించలేదు. ఉన్నమాట—జయలక్ష్మి స్వయంగా ఒప్పుకొన్న మాట—పైగా తాను స్వయంగా కళ్లార చూసిన సంగతి—అంటే తప్పేమి?

ఆమెకు రంగస్వామిగారియెడల ఎంతో జాలికలిగింది.

ఈ సంగతిని తను కనిపెట్టకపోయే వుంటే—తన మనస్సులో పెంపొందుతూ వున్న ప్రేమకొలది మోజుపడి, వెంగలినై పోయి వుండేదాన్నికదా అని ఆమె బాధపడింది.

మధ్యాహ్నం నాలుగు గంటలకు టెలిఫోన్‌లో శివ భాగ్యం పిలిచింది.

ఇంతలోనే లోపలనుంచి వచ్చిన జయలక్ష్మి శివ భాగ్యాన్ని చూచి "ఓహో! బహుకాలదర్శనం" అంది. గోపాలన్‌ను చూసి "మీరు ఊళ్లోనే వున్నారా?" అంది.

"ఆయన నన్ను నేను ఆయన్ని వదిలి వెడితే ఊరు ఉంటుందా" అంది నవ్వుతూ శివ భాగ్యం.

"అయితే మీరంతా డాన్సుకా పోతున్నది?" అని జయలక్ష్మి నవనీతాన్ని ప్రశ్నించింది.

"అవునమ్మా! మీరుకూడా రాకూడదూ! చక్కగా చూసివద్దాం" అంది నవనీతం.

ఆ మాటకు శివభాగ్యం ముఖం ముడుచుకుపోయింది. అది నవనీతం—జయలక్ష్మి కూడా ఒక్కసారే చూశారు.

"ఆయనకు ఏ కాఫి అయినా కలిపి ఇవ్వవలసి వస్తూ వుంటుంది అప్పుడప్పుడు. నేనురాను. నువ్వు పోయిరా"

ముగ్గురు కారులో బయలుదేరారు.

"పాపం ఒంటరిగా వుంటుంది" అంది నవనీతం.

"ఒంటరిగా వుండడమే బాధకలిగిస్తే, అది ఆమెకు తగినశిక్ష అంటాను నేను" అంది శివభాగ్యం.

"ఆవిడంటే నీకు అంత పగ ఎందుకూ?"

"రంగస్వామిగారు భగవంతుడు. ఆయన బ్రతుకు అధోగతిపాల్జేసింది. తాను డాక్టర్‌తో కలిసి విందులు షికార్లు ఆనందిస్తూవుంది. నామాట అలా అట్టే పెట్టు. నువ్వు సహించ గలవా?"

"సహించక నేను చెయ్యగలిగినదేమి ?"

"డాక్టరును ఆమెనుంచి విడదియ్యాలి. అసలు స్త్రీని ఎలా పూజించి, ఆదరించి గౌరవించాలో, స్త్రీలో ఎంతటి గొప్పదనం వుందో అంతా ఆయనకు నిరూపించాలి. వాళ్ళకి ఎడబాటు కలిగిస్తే రంగస్వామిగారికి ఉపకారం చేసినవాళ్ళ మౌతాం. ఇంతకుముందు ఆమె ఏదో నాటకకంపెనీలో కొన్ని వేషాలు వేస్తూవుండేది. తిరుచినాపల్లిలో ఆ కంపెనీ కొన్ని ప్రదర్శన లిచ్చింది. ఇక్కడకూడా ఒకటి రెండు నాటకాలు ఆడడానికి ఆ కంపెనీ వచ్చింది. అంతలో ఆమెకు జబ్బుచేసింది. అప్పుడు మా ఆసుపత్రిలో చేర్చబడింది. కంపెనీవాళ్లు ఆమె నిక్కడ వదిలివేసి చక్కాపోయారు. రంగస్వామిగారు ఆసుపత్రి చూడ్డానికి వచ్చి, ఆమె రూపానికి ముగ్ధుడై కబుర్లతో కత్తు కలిపి పెళ్లి చేసుకొన్నాడు. ఆ తర్వాత ఆరెన్నెల్లకే ఆయన నడుం విరిగి మంచాన పడ్డాడు."

"డాక్టర్ శ్రీనివాసన్‌ను తాను, తన భర్త తిరుచినాపల్లిలో వున్నప్పటినుంచీ ఎరుగుదుమని చెప్పిందే"

"అంతా నాటకం, బూటకం, కల్పన, కట్టుకథ"

"నేను ఈ పట్టణానికి కొత్త. నాకు సంగతులన్నీ అగమ్యంగా వున్నాయి" అంది నవనీతం.

కారు టౌన్‌హాలుదగ్గర ఆగింది. ముగ్గురు లోపలకు వెళ్లారు.

# 9

నాట్య ప్రదర్శన సరిగా తొమ్మిది గంటలకు ప్రారంభమయింది.

పదిగంటలకు ఇంటర్వెల్‌లో నవనీతం గోపాలన్‌ను చూసి "బయటకుపోయి కూల్ డ్రింక్స్ త్రాగుదామా?" అంది.

"ఏం వెళదామా?" అన్నాడు గోపాలన్ శివ భాగ్యాన్ని చూసి.

"నాకు వద్దు. మీరుపోయి త్రాగిరండి" అంది శివ భాగ్యం.

ఇద్దరు లేచి వెడుతూంటే గేటు దగ్గర కుర్చీలో కూర్చునివున్న డాక్టర్ శ్రీనివాసన్ కనిపించాడు. ఆమెగుండెలు వేగంగా కొట్టుకొన్నాయి.

ఆమె నవ్వింది అతణ్ణి చూసి. అతడు ఆమెవంక అదో మాదిరిగా చూసి, "రానన్నావుగా దొంగా" అన్నాడు మెల్లగా.

బయట గోపాలన్ తాను ఆరంజ్ క్రష్‌లు త్రాగుతూ వుండగా గోపాలన్ "నవనీతం! మనం ఇద్దరం ఇలా బయటకు వచ్చి డ్రింక్స్ సేవిస్తున్నామని డాక్టర్‌కు కోపంగా వుండదు కదా" అన్నాడు.

ఆమె కొంచెం రిచ్చపడి "ఎందుకు కోపం" అంది.

"నేను ఓ సంగతి చెబుతా విను. భాగ్యం మాటల్లో కొన్ని నేను నమ్మను. జయలక్ష్మికి డాక్టర్ మీాద మోజు వుండవచ్చు. కాని డాక్టర్ ఆమెను ప్రేమించాడంటే నేను నమ్మను. నీవంక నిన్న హోటల్లో—ఇప్పుడు డాక్టర్ చూచిన చూపులో, నీతో మాట్లాడినప్పుడు, నిన్ను గురించి ఇతరులవద్దర మాట్లాడి నప్పుడు అతని కంఠంలో కనిపించే మార్పును నేను బాగా కనిపెట్టాను. మనసారా అతగాడు నిన్ను ప్రేమించి వుండాలనే నా నమ్మకం. మరి నీమాట నాకు..."

"నామాట ఏమీా లేదు. నేను వచ్చినరోజునే ఇద్దరం తగవు పడ్డాం. ఇంక నేను ప్రేమించడం ఇంతవరకు జరగలేదు. నేను మదరాసులోనే ఒకరిని ప్రేమించాను. ఆ ఆశ అడియాస అయింది. ఆ బాధ నా మనస్సును ఇప్పటికీ పీడిస్తునే వుంది."

"అది నిజం కావచ్చు. కాకపోవచ్చు. కాని అతను నిన్ను ప్రేమిస్తున్నాడని రూఢిగా చెప్పగలను"

"అయినా డాక్టర్‌కి నర్సుకి మధ్య ప్రేమ ఏమిటి? నర్సులు డాక్టర్లను ప్రేమించడం సాహసమే అనాలి. ఉభయుల మధ్య బోలెడు అంతరం వుంది"

ఇంతలో శివభాగ్యం చరచరవచ్చి—"డింకన్ని త్రాగి చక్కావస్తారా. ఇక్కడ సరస సల్లాపాలు ప్రారంభిస్తారా?" అంది.

"నీ మొహం—అన్న చెల్లెళ్ళకు సరససల్లాపాలేమిటి?" అని మందలించాడు గోపాలన్.

"మరి నాకుమాత్రం వద్దూ డ్రింకు" అంది శివభాగ్యం.

"ముందు వద్దనటమే గాక?" అంటూ ఒక డ్రింక్ తెచ్చి ఇచ్చాడు.

ఆ తర్వాత ముగ్గురు లోపలికి వెడుతూవుండగా డాక్టర్ శ్రీనివాసన్ నవనీతాన్ని పిలిచాడు.

"నువ్వు బయలుదేరేసరికి ఆయన ఏంచేస్తున్నారు నవనీతం?" అని అడిగాడు.

"స్వామి ఏవో కబుర్లు చెబుతూంటే వింటున్నారు."

"నేను పోతాను. శివభాగ్యం బంధువులట—ఆ అమ్మాయి ఏవరో. కొంచెం సీరియస్‌గానేవుంది స్థితి. నువ్వు వాళ్ళ కారులోనే ఇంటికి వెళ్లిపో" అన్నాడు.

డాక్టర్ ముఖం ప్రసన్నంగానేవుంది. సరేనని ఆమె తన సీటుదగ్గరకు వెళ్ళి కూర్చుంది. ప్రదర్శనానంతరం గోపాలన్, శివభాగ్యం తమ కారులో ఆమెను రంగస్వామిగారి బంగాళా దగ్గర దిగబెట్టి వెళ్ళిపోయారు.

# 10

మర్నాటిదినం ఉదయం పదిన్నరగంటలకు నవనీతం రంగస్వామి గారి దగ్గర కూర్చొని బిగ్గరగా వార్తాపత్రిక చదివి వినిపిస్తూ వుండగా జయలక్ష్మి ఒక గ్లాసునిండుగా బత్తాయిపళ్ల రసం తీసుకు వచ్చి "త్రాగండీ" అని భర్త మంచంప్రక్కనే వున్న బల్లపైన పెట్టి తాను అక్కడనే నిలబడ్డది.

ఆ గ్లాసువంక చూడగానే రంగస్వామిగారి కళ్లల్లో భయం ప్రతిఫలించింది. ఆయన నవనీతంవంక చూశాడు.

"ఇంక ఒక గంట ఆగండి. అప్పుడు త్రాగుదురుగాని" అంది నవనీతం.

"బత్తాయిపళ్ళ రసానికేం ?" అంది జయలక్ష్మి.

"ఆయన ఇప్పుడే మందు త్రాగారు. అయిదు నిమిషాలైనా కాలేదు. ఇంతలోనే ఆ రసం త్రాగితే మందు పని చేస్తుందా ? పైగా ఇది భోజనంచేసే సమయమాయె. భోజనం చెడదూ ?"

జయలక్ష్మి ముఖంలో అసంతృప్తి, ఆశాభంగం స్పష్టంగా కనిపించాయి.

"కష్టపడి స్వయంగా తయారుచేసి తీసుకువచ్చాను. మీ ఇష్టం అంటూ రుసరుసలాడుతూ ఆమె చక్కా-పోయింది.

రెండు నిమిషాలు నిశ్శబ్దంగా గడిచాయి.

" గ్లాసును రహస్యంగా ఆసుపత్రికి తీసుకువెళ్లు. డాక్టర్ వేదాద్రికి ఇయ్యి. దానిలోని రసాన్ని పూర్తిగా 'ఎనలైజ్' చేసి, చెప్పమను "

నవనీతం ఆ మాటలు విని తెల్లబోయింది. ఆమె ముఖంలో ద్యోతకమైన వెల్లదనాన్ని గమనించి " నిజం. ఆమె స్వయంగా ఎప్పుడు ఏ రసం తెచ్చి ఇచ్చినా, అది త్రాగేసరికి నాకు ఆపాదమస్తకం బాధకలిగి జబ్బు తిరుగబెడుతుంది. వెళ్లు నీకేం భయంలేదు " అన్నాడు రంగస్వామిగారు.

# 11

రంగస్వామిగారి ఆదేశానుసారంగా జయలక్ష్మి తెచ్చిపెట్టిన బత్తాయి రసాన్ని డాక్టర్ వేదాద్రికడకు తీసుకువెళ్ళడానికి నర్సు నవనీతం సమ్మతించింది. ఆ రసాన్ని ఒక సీసాలో భద్ర పరచింది.

సాయంకాలం అయిదుగంటలకు బయలుదేరి ఆసుపత్రికి వెళ్ళబోతూవుండగా—చుట్టు తిరిగి వెళ్ళ నగత్యంలేకుండా ఒక తోటలోనుంచి అడ్డుపడి త్వరగా వెళ్ళవచ్చునని నాగయ స్వామి చెప్పాడు.

" డాక్టర్ వేదాద్రి ఈ విషయాన్ని అతి రహస్యంగా కాపాడగలడు. నీకు ఏమీ భయంలేదు. వెళ్ళి త్వరగా వచ్చెయ్ " అన్నారు రంగస్వామిగారు.

సరేనని నవనీతం బయలుదేరి వెళ్ళింది.

ఆసుపత్రిలో డాక్టరు వేదాద్రిని కలుసుకొంది.

" దీనిలోని బత్తాయి రసాన్ని పరిశీలించి ఇమ్మని రంగ స్వామిగారు పంపారు " అంది.

" సరే. అయితే నేను స్వయంగా పరిశీలించాలి కనక ఇది ఇప్పుడు తేలదు. దీనిలో ఏదైనా హానికరమైన పదార్థం

లేకపోయినపక్షంలో నేను రేపు మధ్యాహ్నంలోపుగా ఫోన్‌లో చెబుతాను. నేను ఫోన్‌లో పిలవకపోతే మధ్యాహ్నం ఒంటిగంట దాటినతర్వాత ఇక్కడకు రా. నాలుగు గంటల లోపుగా నువ్వు ఎప్పుడు వచ్చినా సరే ఇబ్బందిలేదు "

ఆమె సరేనన్నది.

తిరిగి ఇంటికి బయలుదేరేసరికి చీకటి పడ్డది. చుట్టుతిరిగి వెడితే మరీ ఆలస్యమౌతుందని ఆమె తోటకు అడ్డపడి వస్తున్నది. చాలాదూరం వచ్చినది. ఇంతలో వెనకనుంచి "ఏయ్—ఏయ్. ఎవరది ?" అన్న కేక వినిపించింది.

నవనీతం వెనుతిరిగి చూచింది. నుదుట పెద్ద కుంకుమ బొట్టు—విరబోసుకొన్న జుట్టు—భయంకరమైన కళ్ళు—వికృతాకారంగల ఒక స్త్రీ "ఎవర్తెవె నువ్వు—నా తోటలో అడుగు పెట్టడానికి" అంటూ పరుగునవచ్చి, పొడుగాటి తన వ్రేలిగోళ్ళతో నవనీతం జాకెట్టు పట్టుకునేసరికి అది చినిగి పోవడమే గాక గోళ్ళు కండలోకి గుచ్చుకొని రక్తంవచ్చింది.

తోటలలో చీకటిచాటున దయ్యాలు. భూతాలు మసలుతూ వుంటాయని నవనీతానికి వాళ్ళ అమ్మమ్మ ఏనాడో చెప్పినమాట జ్ఞాపకానికి వచ్చింది. ఆమె దయ్యమే అనీ. మానవాంగన కాదనీ తలచగా, భయాతిరేకాన "అమ్మో" అని కెవ్వున కేకవేసి తోటలోనుంచి పరుగెత్తసాగింది.

ఆమె అలా పరుగెత్తుకుంటూనే తోటనుంచి బయటపడేసరికి ఎదట డాక్టర్ శ్రీనివాసన్ కనిపించడంతో ఆమె ఒక్క-ఉదుటున అతని అక్కునజేరి అమ్మో "దయ్యం" అంది.

"నీ మొహం. దయ్యంకాదు. దేవతా కాదు నీ భ్రాంతిగాని—ఏం చూసి జడుసుకొన్నావు? ఏ పామైనా అడ్డుపడిందా"

"పాము కాదు. దయ్యం. అదిగో. ఆ నల్లనిచీర అదిగో"

ఆమె భయానికి కారణభూతురాలైన వ్యక్తి ముందుకు రాగా డాక్టర్ శ్రీనివాసన్ చూసి "ఏమిటీ దౌర్జన్యం అల మేలూ? ఊళ్లోవాళ్ళని ఇలా భయపెట్టడం మానతావా లేక పోతే పోలీసులకు రిపోర్టు చెయ్యమంటావా?" అని అడిగాను.

"ఎవరిని భయపెట్టానండీ. ఈ పిల్ల ఎవరు? నా అనుమతి లేకుండా నా తోటలో ఎందుకు అడుగుపెట్టాలి. ఆ మాట అడిగితే "అమ్మో దెయ్యం" అని పరుగెడుతుందే? దయ్యాన్నా నేను? ఆమాట మీకు బాగుందేం? నేను మీ అందరికంటె తెలివిగా మందిస్తాను. నేను తాకితేనే రోగ నివృత్తి అవు తుంది. నేను జోస్యం చెబితే అక్షరాలా జరుగుతుంది. మీ రంగస్వామిగారికికూడా లేదు నాకున్నంత ఆస్తి. నేను దయ్యాన్నా? ఏంమాట అది?"

"తప్పేలే. పిల్ల కొత్తగా వచ్చింది ఇక్కడికి. నీ కీర్తిని గురించి ఇంకా వినలేదు. పైగా చూడనూలేదు. సరే నువ్వు వెళ్లు."

అలమేలు గొణుగుతూ సణుగుతూ వెళ్లిపోయింది.

"అలమేలు అని ఒక మంత్రకత్తె ఈమె. నిజానికి రంగస్వామిగారికంటె భాగ్యవంతురాలు. లక్షలకొలదీ

రూపాయలున్నాయి. బ్యాంకులంటే నమ్మకంలేదు. భూదేవతనే నమ్ముతుంది. త్రవ్వి పాతరవేస్తుంది. పట్టణానికి పడమటివైపున ఒక గుట్టమీద చిన్న పాకలో నివాసం. రెండు కుక్కలు ఆ ఇంటికి ఆమెకూ రక్షణనిస్తాయి."

"ఎందుకు కుక్కలు కూడాను. ఆమె రూపమే ఆమెకు రక్షకవచం. ఎవరు చూసినా హడలి చస్తారు. అందులో రాత్రివేళ అయితే అసలే చెప్పనక్కరలేదు. ఏమైతేనేం నన్ను హడలగొట్టింది"

"హడలగొట్టినందుకు నాకు కోపంలేదు. ఆమె హడలగొట్టి వుండకపోతే నువ్వు నా అక్కునచేరి వుండేదానవా?"

నవనీతం నాలుక కరుచుకొంది. ఆ మాటలకు ఆమె బుగ్గలు కెంపెక్కినై.

"ఎవరిదగ్గరనైనా చేరివుండేదాన్ని. భయపడ్డప్పుడు రక్షణ కోరడంలో తప్పులేదుకదా"

"లేదుకాని, ఆ రక్షణ కోరినవ్యక్తి ప్రేమిస్తూవుంటే-"

"అంటే నాకు బోధపడలేదు"

"నీకు బోధపడలేదు. నాకూ బోధపడలేదు- ఎందుకు నీమీద నాకు ప్రేమ కలిగిందో అని"

ఆ మాటలు వినగానే ఆమె గుండెలు ఆవేగంతో కొట్టుకున్నాయి.

"నిజమేనా ?" అని ఆమె మళ్లీ అతనికి దగ్గరగా వెళ్ళ బోనున్న సమయంలో ఎవరో వస్తున్నట్లు అడుగుల సవ్వడి వినిపించింది.

అటువచ్చిన జయలక్ష్మి వీరినిచూచి తెల్లబోయింది.

"ఇప్పుడెక్కడికమ్మా" అని డాక్టర్ శ్రీనివాసన్ అడిగాడు.

"షికారుకు"

"చీకటిపడ్డాకా ?"

"నన్ను ఈ పట్టణం ప్రజలంతా వెలివేసినప్పుడు ఇటు వంటి సమయాలలో తప్ప మరెప్పుడు బయటకు వెళ్ళగలను ?"

"తోటలో అలమేలు వుంది జాగ్రత"

"అలమేలా ? పోనీ, ఉంటే నాకేం ? నాలాగే ఊళ్లో వాళ్ళంతా అలమేలును కూడా వెలివేశారు. కనకనే మేము ఇద్దరు స్నేహితులమై వుండవచ్చు. ఎవరికీ ఏవిధంగాను అపకారం చెయ్యని అలమేలంటే నాకు భయమనుకోన్నారా. ఒక గంటలో వస్తాను" అంటూ జయలక్ష్మి తిన్నగా తోట లోనికి చక్కాపోయింది.

"మరి నేను పోతాను. నాకు సెలవిస్తారా ?"

"మన సంభాషణ ఇంకా పూర్తికాండే"

"అది పూర్తికాదు. నేను నిజంగా భయపడే మీకు దగ్గరగా వచ్చి నిలబడ్డాను. అంతేకాని, నా మనస్సులో మరే ఉద్దేశంలేదు. నన్ను క్షమించండి"

"దీనిలో క్షమార్పణ కోరవలసిన పనిలేదు. నాదే పొరపాటేమో వెళ్ళిపో" అని డాక్టర్ శ్రీనివాసన్ మరొక దారిని వెళ్ళిపోయాడు.

ఇంటికి తిరిగిచేరి, డాక్టర్ వేద్రాది చెప్పినమాట రంగస్వామిగారికి చెప్పి, స్నానంచేసి, భోజనం చేస్తున్న సమయాన ఆయాసఖిన్నమైన ముఖంతో జయలక్ష్మి తిరిగి వచ్చింది.

దైన్య విషాదాలు మూర్తీభవించినట్లున్న జయలక్ష్మిని చూడగానే–కొన్నిరోజులక్రితం శివభాగ్యం, గోపాలన్, తాను హోటలులో ఫలహారాలు ఆరగించిన సమయాన అలమేలు నుంచి మూలికా రసాయనాన్ని జయలక్ష్మి తీసుకొంటూ వుంటుందని తాను విన్న సంగతి జ్ఞాపకానికి వచ్చింది.

"ఆమె ఎక్కడికి వెళ్ళివస్తే నాకేం" అనుకొంటూ నవనీతం భోజనం పూర్తిచేసింది.

ఉదయాన ఆమె రంగస్వామిగారికి ఓవల్టిన్ తీసుకువెళ్లి ఇచ్చిన సమయంలో స్వామి ఎవరో టెలిఫోన్‌లో పిలుస్తున్నారని నవనీతాన్ని పిలిచాడు.

డాక్టర్ వేద్రాదే అయివుండాలనుకుంటూ నవనీతం రిసీవర్‌ను తీసుకొని "హల్లో" అంది.

"హల్లో అంటున్నావుగమ్మత్తుగా. ఎవరనుకుంటున్నావు నేను సునేత్రను. నేను మీబావగారు ఒక గంటయింది ఇక్కడకు వచ్చి. ఇక్కడ ఇవాళసాయంకాలం ఒక వైద్యసభ జరుగుతుంది.

దానిలో మీ బావ ఉపన్యాసం ఇస్తారు. నువ్వు ఎలా వుంటున్నావు? ఒక్కసారి "హిందూలాడ్జి హోటల్" రూమ్ నెంబరు 12 కు రా పీలవుతుందా?"

తన అక్క పలుకులు ఎన్నాళ్ళకో వినరావడంతో దుఃఖం పొంగి పొరలి వచ్చింది.

"అక్కా" అని ఆమె మాట్లాడలేకపోయింది. కంఠం రుద్ధమైపోయింది.

"అక్కా! ఎన్నాళ్ళకు విన్నాను నీ మాట, ఒంటి గంటకు డ్యూటీవుండదు. అప్పుడువస్తాను" అని జేబు రుమాలుతో కన్నీరు తుడుచుకొంటూవుండగా చూసి, అక్కడకు వచ్చిన జయలక్ష్మి "ఎవరు మీ అక్కా? ఇక్కడకువచ్చిందా? ఎక్కడవుంది" అంది.

"హోటల్‌లో. మా అక్కా బావా వచ్చారు"

"కర్మం. నువ్విక్కడవుండగా వాళ్ళు హోటల్లో బస చెయ్యాలా. ఇక్కడకు రమ్మను ఈ పూట ఇక్కడ భోజనానికి. రాత్రికూడా ఇక్కడ వుంటారు"

"అక్కా! మా యజమానురాలు నిన్ను, బావగారిని భోజనానికి పిలవమంటున్నారు. వస్తావా అక్కా"

"సరే. పది, పదకొండు గంటలకల్లా వస్తాం. రాత్రే తిరిగి బయలుదేరి వెళ్ళిపోతాం. మీ బావగారికి ఈ ఒక్క రోజు సెలవు దొరకడమే దుర్లభమయింది."

జయలక్ష్మి అతిథులకోసం భోజనసన్నాహాలు చెయ్య బోయింది. నవనీతం మనస్సులో ఆనందం వెల్లివిరిసింది. తన బావ తన హృదయాన్ని ఒకప్పుడు—ఒకప్పుడేమి— ఇప్పటికీ ప్రణయ తరంగితం చేసిన డాక్టర్ సీతారామ్‌ను ఒకసారి చూడ వచ్చు" నని ఆశపడింది. తన అక్క రాకనుగురించి రంగ స్వామి గారితో చెప్పింది. సరిగా పదకొండు గంటలకు వారు వీధిలో ఆగగానే నవనీతం పరుగెత్తుకు వెళ్ళింది.

సునేత్ర హాలులోకి రాగానే అక్క చెల్లెలు ఒకరినొకరు కౌగలించుకొని, చిన్నపిల్లలా ఏడ్చారు.

జయలక్ష్మి వచ్చి "పాపం—రక్తం పంచుకు పుట్టిన అక్కచెల్లెళ్ళ ప్రేమ ఎంత గాఢమైనదో—" అనుకొంది.

"అక్కా! ఈవిడే మా యజమానురాలు-శ్రీమతి జయలక్ష్మి. అమ్మా! ఈమె మా అక్క సునేత్ర. ఆయిన మా బావాగారు డాక్టర్ సీతారామ్‌జీ"

"సంతోషం. డాక్టర్‌గారూ నమస్కారం. అక్క చెల్లెలిద్దరు చక్కని చుక్కలు. మీ రూపాలను చూస్తేనే పంచమహాపాతకాలు పటాపంచలౌతాయి. మావారిని ఒకసారి చూస్తారా" అంది.

"ఓ. సంతోషంగా" అన్నాడు డాక్టర్ సీతారామ్.

అంతా రంగస్వామిగారి గదిలోకి వెళ్లారు.

డాక్టర్ శ్రీనివాసన్ అక్కడ వున్నాడు.

జయలక్ష్మి "డాక్టర్ సాబ్ ! ఈయన డాక్టర్ సీతారాం. నవనీతం బావగారు. ఈమె నవనీతం అక్క సునేత్ర". అని, "ఆయన డాక్టర్ శ్రీనివాసన్" అనీ పరిచయపరచింది.

డాక్టర్ సీతారాం శ్రీనివాసన్‌తో కరస్పర్శ చేసి, రంగస్వామిగారి అస్వస్థతనుగురించి మోరిసన్ ఆసుపత్రి సూపరింటెండెంట్ ద్వారా తాను అంతకుముందు విని వుండడంవల్ల వ్యాధి చికిత్సలోని పరిణామాలను గురించి తెలుసుకొన్నాడు.

ఆ తర్వాత రంగస్వామిగారిదగ్గరకువచ్చి, నమస్కరించి కొన్ని నిమిషాలపాటు సంభాషించాడు. అటుపైన రంగస్వామిగారు కాస్సేపు సునేత్రతో మాట్లాడారు.

తర్వాత "రండి. భోజనానికి"—అని జయలక్ష్మి ఆహ్వానించింది. భర్త దగ్గరకు వెళ్ళి "ఒక్క అరగంటలో తిరిగి వస్తాం" అన్నది.

ఆయన జయలక్ష్మి చూడకుండా నవనీతానికి సంజ్ఞ చేశాడు.

అంతా వెళ్ళిపోగా ఆమె దగ్గరకువచ్చి నిలబడ్డది.

"డాక్టర్ వేదాద్రినుంచి ఏ కబురూ రాలేదుకదూ"

"రాలేదు"

"ఆ పక్షంలో నిన్ను ఆయన ఆసుపత్రికి రమ్మన్నాడు"

"అవును"

" మీ అక్కా, బావా రాత్రికి వుండరు. భోజనంచేసి వెళ్ళిపోతామన్నారు. వారితోపాటు వాళ్ళ కారులోనే పట్నం లోకి వెళ్ళి వస్తాననే సాకుమీద బయలుదేరివెళ్లు. ఎవరూ అనుమానించరు. వెళ్ళి వచ్చేటప్పుడు ఏ రిక్షామీదనో, బండి మీదనో తిరిగిరా "

" సరేనండి. అలావెళ్లి కనుక్కొని వస్తాను "

నవనీతం భోజనశాలలోకి వెడుతుండగా ప్రక్కగదిలో నుంచి వచ్చిన డాక్టర్ శ్రీనివాసన్ " ఓహో ? ఆయనేనా ? " అన్నాడు మెల్లగా.

" నాకు మీరన్నమాట అర్థంకాలేదు. ఆయన నాకు బావగారు "

" నేనన్నది అదికాదు. ఏదో నీకు తెలుసు. పోనీలే. ఇప్పు డెందుకు ఆ ప్రసక్తి " అంటూ డాక్టర్ శ్రీనివాసన్ భోజనశాలలోకి మరిరెండడుగులు ముందుగా వెళ్లాడు.

భోజనానంతరం జయలక్ష్మిదగ్గర, రంగస్వామిగారిదగ్గర సెలవు తీసుకొని సునేత్ర, డాక్టర్ సీతారామ్ బయలుదేరుతూ వుంటే నేనుకూడా ఒకసారి పట్నంలోకి వస్తాను. అంటూ నవనీతం బయలుదేరింది.

“ బాగుంది—బ్రహ్మాండమైన ప్రకృతి సౌందర్యసీమలో వనలక్ష్మిలా నివసిస్తున్నావు. నీకేమైనా ఒంటరిగా వున్నట్లున్నా కష్టంగావున్నా మదరాసు వచ్చెయ్. నీకు ఈ పని కర్మమేం కాలింది. హాయిగా కూచోవచ్చు. మీ అక్కదగ్గర వుండడం తప్పా ? ” అన్నాడు డాక్టర్ సీతారామ్.

సునేత్రకూడా రమ్మంది. కాని తనకు సుఖంగానేవుందని—తన్ను నమ్మిన రంగస్వామిగారికి కొంత స్వాస్థమైనా కలిగేవరకు తాను వుండకతీరదనీ చెప్పింది.

పట్నంలో ఒక వస్త్రాలయంలోకి తీసుకువెళ్లి సునేత్ర నవనీతానికి ఒక బెంగాల్ సిల్కుచీర కొనిపెట్టింది. ఆతర్వాత అక్క, బావలదగ్గర సెలవు తీసుకొని ఆసుపత్రికి వెళ్లింది.

# 12

" ఉదయాన్నే నిన్ను టెలిఫోన్‌లో పిలుద్దామనుకున్నాను. కాని ఎవరైనా మన సంభాషణ వినగలరని— అందులోను ఆ ఇంట్లో నాలుగైదు గదుల్లో టెలిఫోన్ లున్నప్పుడు చిక్కు అని పిలవలేదు. నువ్వే స్వయంగా వచ్చావు. సంతోషం. అలా కూర్చో " అన్నాడు డాక్టర్ వేద్రాది.

ఆమె కూర్చున్నది. బత్తాయిరసం వున్న సీసాను తాను పరిశీలించిన గాజు గొట్టాన్ని ఆమెకు చూపుతూ " దీనిలో అపాయకరమైన దేమీ లేదుకాని, ఏదో ఒక రసంకూడా అదనంగా కలిసింది " అన్నాడు.

" ఆరసం ఏదో చెప్పలేము. అది అపాయం కలిగించదు. కాని, మేలూ కలిగించదు. రంగస్వామిగారివంటి రోగి విషయంలో దాని ప్రభావంఏమో నేనుచెప్పలేను" అన్నాడాయన.

నవనీతం ౹ మాన్పడి, ౹ ప్రతిమలా వినసాగింది.

" ఆ ఇంట్లో వున్న వంటలక్కను, నౌకరు స్వామిని నేను ఏళ్ళ తరబడిని ఎరుగుదును. ఆ రసాన్ని వారు కలిపి వుండరు. ఆ రసం తయారుచేసే వ్యక్తి ఒకామెవుంది. ఆమె పేరు అలమేలు. ఆమె మూలికావైద్యం చేస్తుంది. ఆ మూలికా వైద్యమంటే ఇక్కడి కొండజాతివారికి గురి, విశ్వాసమూను.

కనకనే వారు ఆసుపత్రికికూడా రారు. వారికి ఆ మూలికావైద్యం బూటకమని నచ్చచెప్పడానికి నర్సు శివభాగ్యం పడే శ్రమ ఇంత అంత కాదు. ఆమె దగ్గరనుంచి వచ్చిన మూలికలరసమే దీనిలో చేర్చబడింది. ఈ పని ఆ ఇంట్లో ఒక్కరికే సాధ్యపడుతుంది. దీనికి ఒక్కరే సాహసించగలరు. రంగస్వామిగారిభార్య జయలక్ష్మి ',

రెండు నిమిషాలపాటు నోట మాటగాక అలానే వుండి పోయి, " ఆమె బాగా చదువుకొన్నదిగదా ? మంత్ర తంత్రాల లోను, మూలికలలోను ఆమెకు నమ్మకం వుంటుందా ? "

" ఉంది ఆమె చదువుకున్నా అసలు నచ్చింది, నాటక కంపెనీలో అన్నమాట నీకు తెలియదేమో. ఆమెను గురించి పట్టణంలో అంతా చాలా అసహ్యంగా చెప్పుకొంటారు. ఆవిడ మినహా మరెవ్వరూ ఈ పని చెయ్యలేరు. ఆవిడ అలమేలును తరుచుగా ఈ ఆసుపత్రి వెనకవున్నతోటలోనే కలుసుకొంటూ వుంటుంది "

" ఆ అలమేలును నేను నిన్న చూశాను. నన్ను హడల గొట్టింది "

" ఇంకనే ఆమె స్వరూపంచూస్తే చిన్నపిల్లలు మంచం పడతారుకూడా "

ఇంతలో తలుపు త్రోచుకొని డాక్టర్ శ్రీనివాసన్ వచ్చి " మిస్టర్ వేదాద్రి ! ఎందుకు రమ్మన్నావట ? " అనిఅడిగాడు.

డాక్టర్ శ్రీనివాసన్‌ను చూడగానే నవనీతానికి పంచ ప్రాణాలు పై కెగిరిపోయినంత పనయింది.

# 13

“ ఓ ! నిన్ను చూడనేలేదు ” అన్నాడు డాక్టరు శ్రీనివాసన్ నవనీతాన్ని చూసి.

“ డాక్టర్ శ్రీనివాసన్ ! కూర్చోండి. మనకు మళ్ళీ అలమేలు రసాయన పరిశోధనావసరం కలిగింది. కనుకనే మీకు కబురు చేశాను. ”

“ ఏమైతేనేమి. ఆమెపై మనం ఏ చర్య తీసుకోలేము. ఆమె మూలికావైద్యం అంటే ఇక్కడ ఎందరికో ఇష్టం. చూడలేదూ భగవాన్‌దాసుకోసం మనం అంతా ఏడు రోజులు అహర్నిశలు కష్టపడి, రక్తం లోపలకు ఎక్కించి ఇంజక్షనులిచ్చి నానా అవస్థ పడితే, చివరిక్షణంలో వచ్చి ఏదో ఒక మూలికా పసరు త్రాగించిన అలమేలు వైద్యానికే రోగనివృత్తి అయిందన్నారు. అయితే ఇప్పుడు మళ్లీ దేనిలో ఆమె రసాయనాన్ని కలిపింది ? ”

“ రంగస్వామిగారి ఆహారంలో ”

“ ఆ ! రంగస్వామిగారి ఆహారమా ? ”

“ అవును ... మిస్ నవనీతం తీసుకువచ్చింది పరీక్షకోసం. మీతో చెప్పే తీసుకువచ్చి వుంటుందనుకొని, మీకు కబురం

పాను. బత్తాయిరసంలో కలిపింది ఆ మూలికల సారం కాని, అది హానికరమైనది కాదు ”

“ నాకిదేమీ అర్థం కావడంలేదు ”

డాక్టర్ వేద్రాది ఈ విషయాన్ని అతి రహస్యంగా కాపాడతాడని రంగస్వామిగారు చెబితే, ఆయన ఈ విధంగా డాక్టర్ శ్రీనివాసన్‌కు వెల్లడిచెయ్యడంతో మహాసందిగ్ధావస్థలో పడ్డ నవనీతం ఇక మార్గాంతరం లేక ఇలా అంది :

“ నిజమే. నేనే తీసుకువచ్చాను. జయలక్ష్మిగారు ఆ రసాన్ని తీసుకువచ్చి త్రాగమనగా ఆయన త్రాగక ఇక్కడకు తీసుకువెళ్ళి పరీక్ష చేయించమన్నారు. ”

డాక్టర్ శ్రీనివాసన్ నేత్రాలు ఆగ్రహోదగ్రములైనవి.

“ ఒకవేళ ఆయన అలా అన్నప్పటికి ముందు నాతో చెప్పడం అవసరమని నీకు తోచలేదా ”

“ తోచకపోలేదు. కాని ఆయన మీతో కాని, ఎవరి తోను కాని చెప్పవద్దని నొక్కి చెప్పారు ”

“ చెప్పారే అనుకొందాం. రోగి చెప్పిన మాటలు ఎంత వరకు పాటించాలో నీకు తెలియని పక్షంలో నీకు అనుభవ మేమున్నదని భావించను ? రోగి మనస్సుకు అనుమానాలు, సందేహాలు సహజమన్నమాటైనా నీకు తెలియకపోయిందా?”

“ తెలియకపోలేదు. మీతో చెప్పాలని నేననుకోనక పోలేదు కూడా. అయితే నిన్న సాయంకాలం మనం కలుసుకొన్న తరవాత ... ...”

ఆప్పుడు అతనికి "నిన్ను ప్రేమిస్తున్నా" నని అన్న మాటలు జ్ఞాపకానికిరాగా, క్రోధం కొంచెం చల్లారి-"ఓహో! అలమేలును చూసి హడలిపోయిన సందర్భంలో మరచి నట్లున్నావు" అన్నాడు.

"అయితే నీకు ఈ తోటలో నిన్న అలమేలు తారస పడ్డట్లే. నువ్వు వెళ్ళిపోయిన తర్వాతనే బహుశా జయలక్ష్మి తోటలోకివచ్చి, అలమేలును కలుసుకొంది. అలమేలు ఆమెకు తన మూలికా రసాయనాలను అందించే సంకేత స్థలమే ఈ తోట" అన్నాడు డాక్టర్ వేద్రాద్రి.

"నాకేం తెలుసు. అలమేలును కలుసుకోనడానికే జయలక్ష్మి వెడుతూందని? షికారుకనే అనుకున్నాను. పాపం వెర్రిమొహం"

ఆ మాటకు డాక్టర్ వేదాద్రి, నవనీతంకూడా చకితు లైనారు. వెర్రిమొహం. ఎంతచనువు, ఎంత ప్రేమ లేకపోతే ఆ మాట అంటావు? పైగా తాను ఇద్దరు ఆలింగన పాశబద్ధులై వుండగా చూసిందాయె. మేము ఒకరినొకరం ప్రేమించు కొన్నామని జయలక్ష్మి స్వయంగా ఒప్పుకొన్నదాయె. ప్రేమ లేకపోతే ఎదటివాళ్ళు ఏమనుకొంటారో ఏమని అపోహ పడతారో అనైనా జంకులేకుండా ఎక్కడ పడితే అక్కడ ఆమె కోసం వాదిస్తాడా?

ఈ విధంగా ఆలోచనాపరంపరలో నిమగ్నయైవున్న నవనీతం డాక్టర్ శ్రీనివాసన్ లేచి "సరే" అనగానే ఉలిక్కి పడ్డది.

"ఏమైనా రంగస్వామిగారికి ఇచ్చే ఆహారంలో జయ లక్ష్మి ఏ మందు మ్రాకు కలపని రోజుకూడా రాకపోదు. అదైనా త్వరలోనే" అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్.

"అటువంటి రోజుకోసమే నేను సంతోషంతో ఎదురు చూస్తూ వుంటాను" అన్నాడు డాక్టర్ వేదాద్రి.

"చూడవచ్చు. నాకు అవతల ఒక రోగిని చూచి రావలసిన పనివుంది. వెళ్లాలి" అంటూ డాక్టర్ శ్రీనివాసన్ నవనీతంవంక తీక్షణంగా చూసి చక్కా పోయాడు.

"ఇంతకీ కేసులో పనిచేస్తున్న డాక్టర్ శ్రీనివాసన్‌కు తెలియకుండా నువ్వు ఇక్కడకు రావడం నీ వృత్తికి తగినపని కాదు. మంచయినా, చెడ్డయినా అతనితో చెప్పివుండవలసింది. అతని మనస్సుకు చాలా కష్టం కలిగింది. ఇటువంటి పనులు మాలోమాకు విభేదాలు కలగడానికి దారితీస్తాయి ఏమంటావు"

ఔనని నవనీతం తలవంచుకొనే మెల్లగాఅన్నది. తాను చేసినపని తప్పని గ్రహించి ఆమె కుమిలిపోసాగింది.

"సరే వెళ్ళివస్తానండి" అని ఆయనతో చెప్పి తిన్నగా ఇంటికి వెళ్ళినది.

సరాసరిగా రంగస్వామిగారి గదిలోకి వెళ్ళి "మరేం ప్రమాదంలేదనీ. ఆ రసంలో ఏదో ఒక పదార్థం కలిసివుండడం మాత్రం నిజమని, అది కొంచెం వెష్ట పుట్టించడం తప్పితే మరేమీ చెయ్యదనీ వేదాద్రిగారు చెప్పారు" అని అన్నది.

"ఏదో కలిపిందీ? కలిపిందేమో సూచించలేదా?"

"లేదు. అలమేలు తయారుచేసిన పసరుట అది"

"అయితే అలమేలు ఇంకా బ్రతికివుందా? పాపం మూడేళ్ళక్రితం నేను కొండమీద జోడు లేకుండా నడుస్తుంటే గాజుపెంకు గుచ్చుకుని కాలు తెగింది. ఏ మూలలనుంచి వచ్చిందో ఏదో ఒక ఆకు పిండి పసరుపూసింది. ఆ క్షణంలోనే ఆ గాయం మాయమైపోయింది. పాపం నా ఆరోగ్యంకోసమని జయ ఈ విధంగా తాపత్రయ పడుతుంది. బత్తాయిపళ్ళ రసం బాగుంటనే జయలక్ష్మితో చెబుదాం. రేపుకూడా తయారుచేసి ఇమ్మందాం" అన్నాడు రంగస్వామి. ఒక్క క్షణం ఆగి—
"నాకు తెలుసు ఇదంతా. కనకనే ఆమె ఏది తీసుకువచ్చినా త్రాగడానికి, తినడానికికూడా భయపడతాను. ఇంక నాకు ఈ వ్యాధినుంచి విముక్తిలేదు. ఒక్కసారే విముక్తి..." అన్నాడు.

ఆ మాటలు వినగానే నవనీతం మనస్సు ఆవేదనతో వికలమైపోయింది. మెల్లగా తన గదిలోకి వెడుతూవుండగా ప్రక్కనున్న గదితలుపు నెవరో మెల్లగా మూసివేస్తున్నసవ్వడి అయింది. కాని ఆమె ఆవైపు చూడడానికి సాహసించలేక పోయింది.

ఆ తలుపు అలా మెల్లగా మూతపడిన రహస్యం ఆ తర్వాత కొన్ని గంటలకుగాని ఆమెకు గ్రాహ్యం కాలేదు.

# 14

ఆరోజు సాయంకాలం ఆరున్నరకు డాక్టర్ శ్రీనివాసన్ వచ్చాడు. ఆయన రంగస్వామిగారితో సరదాగా అయిదు నిమిషాలు మాట్లాడి బయటకు వెళ్ళిపోతూ నవనీతాన్ని రమ్మని సంజ్ఞ చేశాడు.

ఆమె సందేహిస్తూనే అతనిదగ్గరకు వెళ్ళింది.

"నాకు తెలియకుండా నువ్వు ఆ బత్తాయిరసంతీసుకొని పరీక్షకోసం డాక్టర్ వేదాద్రి దగ్గరకు వెళ్ళడం తప్పేనా?"

"తప్పే కావచ్చు. కాని ఆయన చెప్పవద్దన్నారు"

"ఆయన లోపల ఏవేవో భ్రమలు భ్రాంతులు పెట్టుకుని సతమతమౌతూవుంటే ఆయన అన్నదానికల్లా భళాభళీ అనడమేనా మనపని. రోగి నోరునొచ్చి, తినరాని పదార్థాన్ని కోరితే పాపం అని జాలిపడి ఇచ్చివేయడమేనా? తన భార్య ఆహారంలో ఏ విషమో కలుపుతున్నదని ఆయన అనుమానం. దీనికి తగినట్లే రెండుపనులు జరిగాయి. ఆ విషం ఏదైనా కలిపిందని నువ్వు నమ్మడం. రెండవది నాకు చెప్పకపోవడం వల్ల—అది నేనే ఆమెకు ఇచ్చివుండాలని నువ్వు భావించడం. నువ్వు ఈ విధంగా వర్తించడానికి నేను నీకు ఏం అపకారం

చేశానో నాకు బోధపడడంలేదు ? వైద్యం చెయ్యడానికివచ్చి, రోగి భార్యను ప్రేమించి, రోగికి విషమిచ్చి చంపివేసేటంత నీచుడనుకాను. నేను చేసిందల్లా తప్పైనా, ఒప్పైనా ఒక్కటే. అది నిన్ను ప్రేమించడం. నిన్ను ప్రేమించిన ఆ ప్రేమను నా మనస్సునుంచి తొలగించివేసే శక్తికూడా నాకు లేకపోలేదు. ఎవరైనాసరే " మిస్ నవనీతం " అనేసరికి " ఆమెను నేనసలు ఎరుగనేఎరుగను" అని స్పష్టంగా చెప్పివేస్తూవుంటాను"

" నాకు తెలుసు. మీరు జయలక్ష్మినే ప్రేమిస్తున్నారు"

" ఆ ! అలాచెప్పు. ఆ అనుమానంతోనే—ఆ అసూయతోనే ఇంతవరకు ..."

" అసూయకాదు. అనుమానంకాదు—నేను స్పష్టంగా కళ్లారా మీ ఇద్దరిని చూశాను "

" అయితే భర్త ఇక ఎన్నటికీ ఆరోగ్యం పొందలేడని తెలిసి, ఏడుస్తున్నా వ్యక్తిని ఓదార్చడం ప్రేమించడమా ? "

" ఆరాత్రే ఆమె నా గదిలోకివచ్చి స్పష్టంగా చెప్పింది—నేను డాక్టర్ శ్రీనివాసన్ ఒకరినొకరం ప్రేమించుకొన్నామని ఈ సంగతి రంగస్వామిగారితో చెప్పవద్దనికూడా ఆమె నన్ను బ్రతిమాలింది. మీరేమో నాదే తప్పని వాదిస్తున్నారు " అని తన శరీరాన్ని, హృదయాన్ని ఊపివేస్తున్న ఉద్రేకాన్ని నిలుపుకొనలేక, పొంగి పొరలి వస్తున్న దుఃఖాన్ని దిగమింగి చరచర తన గదిలోకి వెళ్లిపోయింది.

డాక్టర్ శ్రీనివాసన్ కారులో వెళ్ళిపోతున్న శబ్దం విన్న తర్వాత తిరిగి రంగస్వామిగారి దగ్గరకువెళ్లి కాస్సేపు కూర్చుని కబుర్లు చెప్పింది.

ఆ తర్వాత భోజనానికి వెళ్లినపుడు వంటలక్క చెప్పింది-జయలక్ష్మికి తలనొప్పిగా వుందని. తన గదిలోనే పడుకొన్నదనీని.

నవనీతం భోజనం చేశాక తిరిగి రంగస్వామిగారి దగ్గరకు వెళ్లి తొమ్మిదిన్నరదాకా కూర్చొని తన గదికి వెళ్లింది.

నాటి మధ్యాహ్నంనుంచీ జరిగిన సంఘటనలకు మనస్సు కళవళపడగా, ఆమె ఏమో దీర్ఘంగా ఆలోచిస్తున్నట్లు చాలా సేపు అలానే కూర్చుండిపోయి——చివరకు నిద్ర కూరుకురాగా మేను వాల్చింది.

ఇంతలోనే " అమ్మా ! అన్న పిలుపు తలుపుతట్టిన శబ్దం వినిపించగా నవనీతం లేచి తలుపు తెరచింది.

వంటలక్క ఆత్రంగా " అమ్మగారికి ఏమీ బాగాలేదు. ఏ విషం త్రాగిందో ఏమో——ముఖం వికృతమై గదిలో క్రింద పడివుంది " అంది.

నవనీతం గబగబ ఆమె గదిలోకివెళ్లి క్రింద పడివున్న జయలక్ష్మిని—ఆమె ప్రక్కనేవున్న గాజుగ్లాసును తీసిచూసింది.

" వెంటనే ఆసుపత్రికి—— లేకపోతే ఇంటికి ఫోన్ చేసి డాక్టర్ శ్రీనివాసన్‌ను నుంచున్నపళంగా రమ్మని చెప్పు " అని స్వామితో అన్నది.

స్వామి టెలిఫోన్ చేసి "ఆయన కారులో వస్తున్నారు. తల్లీ" అన్నాడు.

ఇంతలో ఆ విషం కక్కడానికి నవనీతం ప్రథమచికిత్స చేసింది.

"డాక్టర్ శ్రీనివాసన్ గారూ నే తాను చేసిన ప్రథమ చికిత్సను వివరించింది.

"ఏమైతేనేం—తన ప్రాణం తీసుకోవడానికి తెగించింది. ఈ పట్టణంలోని వారు, ఈ ఇంట్లోనివారు—చివరకు ... ఎవరు కూడా ఆమె నర్థం చేసుకోలేకపోయారు. ఆమె పరిస్థితిని గ్రహించలేకపోయారు. ఆమెను ఆదరించలేకపోయారు. అదే ఈ చర్యకు ఆమెను ప్రేరేపించింది."

ఇంతలోనే కొంచెం దూరంనుంచి "ఆ! ఆ! ఆ!" అని వినిపించడంతో "అదేమి?" అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్.

స్వామి ముందుకు వెళ్లాడు.

రంగస్వామిగారు లేచి, నడిచివచ్చి తలుపు కానుకొని "ఏమిటది?" అంటూ మళ్లీ "అబ్బా" అన్నాడు.

"అరె! ఏమిటీచిత్రం" అంటూ డాక్టర్ శ్రీనివాసన్, ఆయనకంటె ముందుగా స్వామి వెళ్ళి రంగస్వామిగారిని పట్టుకొన్నారు.

"అంతా అటూ ఇటూ హడావిడిగా కంగారుపడి తిరగడమేకాని ఏమిటో నాకెవరూ చెప్పకపోతే కంగారుపడి—

జయలక్ష్మి ఏ అఘాయిత్యానికైనా ఒడిగట్టిందేమో అని లేచి వచ్చాను "

స్వామి ఊతగా ఆయన జయలక్ష్మి గదిలోకి వచ్చి సోఫాపై కూర్చొని— ఒకసారి ఆమెవంక చూసి— " ఏం చేసింది ? " అని అడిగాడు.

" తలనొప్పి, పార్శ్వపునొప్పి అని అస్తమానం అంటుం దని ఎప్పుడైనా మరీ బాధగా వున్నప్పుడు నిద్రపట్టడానికిచ్చిన మాత్రలను మోతాదు మీరి వేసుకొంది. అయితే మీరు లేచిరావడానికి ఇదే తొలి ప్రయత్నమా ? "

" కాదు. అప్పుడప్పుడు నా గదిలోనే నడుస్తున్నాను "

" ఈ మాట నా దగ్గర దాచవలసిన పనేమీ వచ్చింది? నేను వింటే సంతోషించనా ? "

" సంతోషించవచ్చు. కాని ఈ గుణం తాత్కాలిక మేమో అని భయపడ్డాను. అయినా మంచంమీద పడివుండడం వల్ల ఇష్టమైనవీ, ఇష్టంకానివీ అన్నీ చెవిని పడుతూ వుండడం కూడా—ఒక అలవాటయి, శ్రోతశ్శక్తి బాగా హెచ్చింది. నవనీతం ఏమి మాట్లాడినా— మీరు ఏం మాట్లాడినా నాకు ఇట్టే వినిపిస్తుంది "

" మీ మాట నాకు అర్థం కావడంలేదు. అదేమో స్పష్టంగా చెబితే సంతోషిస్తాను "

" మరేమీ లేదు. ఒకనాడు మీరు నవనీతంతో హాల్‌లో డ్యాన్సును గురించి ప్రస్తావిస్తుంటే మంచివ్వడానికి

వచ్చి రోగి భార్యతో సరసమాడే డాక్టర్లంటే నాకు సరిపడదని అంటూవుంటే విన్నాను.” ఆ మాటలు విని, నవనీతం వంటలక్క, స్వామి, దాసిపిల్ల నిర్విణ్ణులై పోయారు.

“కనుకనే మీ ఇద్దరి ప్రణయం ఎంతవరకు మితిమీరుతుందో స్వయంగా చూడగలిగేపాటి దార్ఢ్యం కలిగేవరకూ ఇలా పడివుండాలనే నిశ్చయించుకొన్నాను”

మీ అనుమానమే మీ ఆవిడ ఆత్మహత్య చేసుకోవడానికి కారణమయింది. సరే ఆమెకు మందిచ్చాను. జీవిస్తుంది మీ రోగంకూడా నయమయింది. కనక నేను ఇక ఇక్కడికి రాను. మీకింకా ఏమయినా చికిత్స చేయవలసివస్తే డాక్టర్ వేదాద్రి వస్తాడు. ఇవాళే అతన్ని ఇక్కడకు తీసుకువచ్చి మీ కేసు వివరాలన్నీ చెప్పి అప్పగించి నేను వెళ్ళిపోతాను. మీరు నిశ్చింతగావుండవచ్చు. గుడ్ నైట్” అంటూ డాక్టర్ శ్రీనివాసన్ వెళ్ళిపోయాడు.

“మీరు అన్న మాటలలో ధర్మంలేదు. ఆయన మీ కోసం అహర్నిశలు బాధపడ్డాడు. ఆయనను అలా అవమానించడం తగనిపనే” అంది నవనీతం.

“తగనిపనేకాని ఈ అనుమానం నీకుమాత్రం ఇక్కడకు రాగానే కలగలేదు. ఇందాకనేకదా నేను ఆయన ఒకరినొకరం ప్రేమించుకొన్నామని జయలక్ష్మి అన్నట్లు నువ్వు డాక్టర్తో చెబుతున్నావు. నేను వినలేదనుకొన్నావా? ఈ ఆవేదనే లేకపోతే ఎన్ని నెలలక్రితం నాకు స్వాస్థ్యం చిక్కివుండేది”

"ఇంతకీ నాదే తప్పు. నేను ఇక్కడకు వచ్చిననాడే స్టేషనులోనే—నీ వయస్సు మరీ చిన్నది. నీకు అనుభవం వుండదు. అని. ఆ తర్వాత జరిగిన సంఘటనలు అక్షరాలా ఆ మాటను రుజువు చేసినవి. నేను తెలివితక్కువదాన్ని కనక నే—మీ గది వెలపల ఉద్రేకంతో మీరు వింటారనే శంక అయినా లేకుండా మాట్లాడాను. నేనుకూడా ఇక్కడ వుండను. మరొక వర్షం రాగానే వెళ్ళిపోతాను"

స్వామి వచ్చి—"బాబూ! గదిలోకి రండి" అన్నాడు.

"వద్దు కాస్సేపు కూర్చుంటాను...... నువ్వు చాలా శ్రమపడ్డావు. కాసేపు విశ్రమించు తల్లి. నన్ను స్వామి మెల్లగా గదిలోకి తీసుకు వెడతాడు లే"

ఆయన ఒక్కడు జయలక్ష్మి దగ్గర కూర్చొన గోరు తున్నాడని గ్రహించి నవనీతం తన గదిలోకి పోయింది.

మరునాటి ఉదయం ఆమె రంగస్వామిగారి దగ్గరకు వెళ్ళగానే ఎంతో ఆప్యాయనంగా రాత్రి ఏమీ జరగనట్లుగానే మాట్లాడాడు.

తొమ్మిది గంటలకు డాక్టర్ శ్రీనివాసన్ డాక్టర్ వేద్రాదితో వచ్చాడు.

"ఆదినుంచి ఆయన చికిత్స చేసినపుడు నయమైనతర్వాత కొన్నాళ్ళు ఆయనే చూస్తే సరిపోయేదిగా. మళ్ళీ ఈ మార్పు దేనికి?" అని అడిగాడు డాక్టర్ వేద్రాద్రి.

"ఆయన నేను బ్రతిమాలినా ఇక ఉండడనే నా భయం"

డాక్టర్ శ్రీనివాసన్ రంగస్వామిగారి చికిత్స పరిణామాలన్నీ వివరించి, "మీకు మిస్ నవనీతం అన్నివిధాల తోడ్పడగలదు" అన్నాడు.

"క్షమించాలి. నేను రాత్రే రంగస్వామిగారితో చెప్పివేశాను. మా అక్క బావ రమ్మని ఉత్తరం వ్రాసారు. మరొక నర్సు కుదరగానే నేను మదరాసు వెళ్ళిపోతాను."

"ఇంత ఆకస్మికంగా నిర్ణయించుకొన్నావే వెళ్ళిపోవాలని!"

"నేను ఈ కేసుకు పనికిరాను. ఆ మాట మీకు మొదలే చెప్పారుకూడా"

"సరే. నేను పోయి ఆనకవస్తాను. అవతల ఆసుపత్రిలో ఒక ఆపరేషన్ వుంది" అంటూ డాక్టర్ వేద్రాది వెళ్ళిపోగానే ఆమె "జయలక్ష్మిగారు చాలా నీరసంగా నిరుత్సాహంగా కనిపిస్తున్నారు" అంది.

"ఒకసారి చూస్తా" నంటూ ఆయన–ఆయనతోపాటు నర్సు ధర్మాన్ని పురస్కరించుకొని నవనీతం వెళ్లారు.

"ఏమండీ! జయగారూ! ఎలావుంది?" అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్ నవ్వుతూ.

"ఈ నవ్వులకేం లెండి. మీరూ, నవనీతం రాత్రి నన్ను కష్టపడి బ్రతికించారేకాని మీ ఇద్దరి చర్యను నేను ఎంత మాత్రం హర్షించలేకుండా వున్నాను" అంది జయలక్ష్మి.

# 15

"నన్ను కష్టపడి బ్రతికించారే కాని, మీ ఇద్దరిచర్యను నేను ఎంతమాత్రం హర్షించలేకుండా వున్నా"నన్న జయలక్ష్మి మాటలకు నవనీతం తెల్లబోయినప్పటికీ డాక్టర్ శ్రీనివాసన్ మాత్రం నవ్వుతూనే—"అంత సాహసానికి ఒడిగట్టినపుడు అది విఫలం కావడంతో వెంటనే మా చర్యను హర్షించడం నీకేకాదు. ఎవరికైనా సాధ్యపడదు. అయినా ఉన్మాదులెవరో చెయ్యవలసినపని అది. ఆత్మహత్య మహాపాతకం అన్నమాట నీకు తెలియదా ?" అని అన్నాడు.

"అన్నీ తెలుసు. తెలిసే, ఈ పని చెయ్యవలసివచ్చింది. నేను ఆయనను కోరి వేడి పెళ్లి చేసుకొన్నాను. ఆయనను వలచి, వలపించుకొన్నాను. నేను ఈ ప్రాంతాలకు ఒక నాట్య మండలితో వచ్చినపుడే ఆయనను కలుసుకొన్నాను. అదయినా ఆసుపత్రిలో. ఆ ఆసుపత్రిలో తొలిసారిగా చూసినపుడే ఆయన స్వరూపానికి ముగ్ధురాలనైనాను. ఆయనకూడా నన్ను చూచినది మొదలు వెంబడించి, పెళ్లి చేసుకొంటానని వాగ్దానంచేసి, తనతో వచ్చెయ్యమంటే నేను కాదనలేకపోయాను. వివాహానంతరం మేము ఇద్దరం ఎంతో కులాసాగా రోజులు గడిపినాము.

ఆయన గుర్రంమీదనుంచి పడిపోతే నేను కారకురాలనని అంతా అనుకొన్నారు. నిజంగా నేను ఆయన స్వారీ నైపుణ్యం చూడడానికి గట్టుమీదనుంచి పరుగెత్తించండి అని అనివుండకపోయినట్లయితే ఆ ప్రమాదం సంభవించివుండేదికాదని ఎంతో బాధపడ్డాను. అప్పటినుంచి ఎన్ని వైద్యాలు చేయిస్తున్నానో, ఎన్ని దేవుళ్ళకు మ్రొక్కుతున్నానో భగవంతునికే తెలుసు. చివరకు అలమేలు మూలికావైద్య ప్రభావాన్ని కళ్లార చూసివుండడంవల్ల, ఆ వైద్యానికికూడా భ్రమపడ్డాను. నిజంగా ఆమె ఇస్తున్న రసాయనం మూలంగా ఎప్పటికైనా ఆయన స్వాస్థ్యం పొందగలరనే నేను ఆశించాను. కాని నా ఆశలన్నీ నిన్నటితో భగ్నమైపోయినై. నవనీతం వాళ్ళ అక్కబావలతో కలిసి, పట్నంలోకి వెళ్ళి తిరిగివచ్చి ఆయనతో బిగ్గరగా "అందులో ఏమీ అంత ప్రమాదకరమైనది లేదుకాని, అలమేలు ఇచ్చిన రసాయనం మాత్రం ఏకో వుంది" అని ఏదో చెబుతూవుండగా నేను స్పష్టంగా విన్నాను. "కలిసింది. నేను అనుకొంటూనే వున్నాను" అని ఆయన అంటున్నారు. ఆ మాటలు వినడంతో నా శిరస్సుపైన పిడుగుపడినట్లయింది. ఇక నేను బ్రతికే ఫలితమేమనుకొన్నాను. ప్రాణం తీసుకొనడానికి నిశ్చయించుకొన్నాను. నన్ను మీ ఇద్దరు బ్రతికించి, తిరిగి బాధపెట్టారు" అని ఉద్రేకం ఆపుకోలేక చిన్నపిల్లలా ఏడ్చింది.

ఇంతలో స్వామి వచ్చి "అయ్యగారు పిలుస్తున్నా" రని డాక్టర్ శ్రీనివాసన్‌తో చెప్పాడు.

డాక్టర్ శ్రీనివాసన్ వెళ్ళి, స్వామి, తాను ఊతగా రెండుప్రక్కల నిలబడి-రంగస్వామిగారిని తీసుకువచ్చారు.

ఆయన జయలక్ష్మినిచూసి "కులాసాగా వున్నావా?" అని అడిగేసరికి, తన అవ్యక్తపు ఆత్మహత్యా ప్రయత్నాన్ని గురించే ఆయన అలా అంటున్నారని గ్రహించి, జయలక్ష్మి తలవంచుకొంది.

ఆయన మెల్లగా రెండడుగులు ముందుకువేసి, జయలక్ష్మి దగ్గర కూర్చుని ఆమె చేతులు పట్టుకొని "ఎందు కంతపని చేశావు జయా?" అని అడిగారు.

తాను చేసిన అవివేకపుపని మాట ఎత్తక, ఆయన నడిచి రావడానికి విస్మయపడ్డ జయలక్ష్మి "ఇది నిజంగా అలమేలు పూసలికల ప్రభావమే అయివుండాలి. నడిచివచ్చారు. ఎంత వింత!" అంది.

"చాలు చాలు. ఊరుకోండి. ఎవరైనా వింటే నవ్వి పోతారు. అలమేలు ఇచ్చిన ఆ ఘండాలపు మందులవల్ల నయమైందా? ఎంత అవ్యక్తపుమాట. రాత్రి పగలు అనక రోజుకు వెయ్యి రూపాయలిచ్చినా ఏ డాక్టరు చెయ్యడానికి ఇచ్ఛగించనంత సేవచేసి, తన కౌశలాన్నంతా వినియోగించి, చికిత్స చేసి, అసాధ్యమైన వ్యాధినుంచి మీవారికి స్వాస్థ్యంకలిగించిన

దైవసమానుడు డాక్టర్ శ్రీనివాసన్‌ను వదలివేసి ఆ మాయ దారి అలమేలుకు జోహారు లర్పించడం సిగ్గుచేటు. ఆ దరిద్రపు మూలికల సారం ఆయన ప్రాణం తియ్యనందుకు సంతోషించండి. నిన్నరాత్రి మరొక అరగంట డాక్టర్ శ్రీనివాసన్ రాకపోయివుంటే– మీరు ఏమై వుండేవారు. అదేంమాటండి" అని నవనీతం అనేసరికి డాక్టర్ శ్రీనివాసన్ విభ్రాంతుడైనాడు.

"నిజమే. ఆయన కష్టపడి చికిత్స చెయ్యడంవల్లనే నేను బ్రతికి బయటపడ్డాను" అన్నారు రంగస్వామిగారు.

"నిజమే నవనీతం. డాక్టర్‌గారిని కొంచెం గమ్మత్తు చెయ్యడానికే నేను అలా అన్నాను" అని జయలక్ష్మి సర్దుకొంది.

ఇంతలో టెలిఫోన్ గణగణ మ్రోగింది. నవనీతం పరుగెత్తుకువెళ్ళి రెండు నిమిషాలలో తిరిగివచ్చి—"ఆసుపత్రికి మిమ్మల్ని వెంటనే రమ్మనమని చెప్పమన్నారు డాక్టర్ వేదాద్రిగారు. ఏదో అతి జరుగురుగా ఆపరేషన్ చెయ్యవలసిన కేసట" అంది.

"సరే. నేను వెళ్లి మళ్లీ వస్తాను. ఈలోగా స్వామి, నవనీతం——ఊంత ఇవ్వకుండా మీరు మీ గదిలోకి వెళ్ళకండేం" అని రంగస్వామిగారితో చెప్పి, డాక్టర్ శ్రీనివాసన్ వెడుతూవుండగా నవనీతం, రంగస్వామిగారికి ఇవ్వవలసిన మందు విషయంలో ఏదో అడగడానికని కారుదాకా వెళ్ళింది.

అది చెప్పి—"నవనీతం! ఏమి—నన్ను చూస్తేనే అసహ్యించుకొనేదానవు. నా తరఫున జయలక్ష్మితో అంత తీవ్రంగా యుద్ధంచేశావేమిటి?" అని డాక్టర్ శ్రీనివాసన్ అడిగాడు.

"కాకపోతే ఏమిటండీ. ఆవిణ్ణి అలా ధిక్కరించి మాట్లాడ్డం తప్పేగాని—చేసినసేవకు మెప్పు లేకపోతే నేను సహించలేను"

"నువ్వు అలా వెనకవేసుకు వస్తావని కలలోకూడా అనుకోలేదు. నేనంటే నీకంత అయిష్టమైవుండికూడా."

"అయిష్టమేమీ లేదు"

"అయితే ఇష్టమున్నట్లేనా"

"అట్లే—"

"అట్లే—ఇట్లే అని ముభావంగా చెప్పక స్పష్టంగా చెప్పు"

"ముమ్మాటికీ ఇష్టమే. అట్టూ లేదు, ముక్కూ లేదు. నిజంగా నా మనస్సును మీరు వికలంచేసి పారేశారు. మన శ్శాంతికోసం నేను ఇక్కడకు వస్తే—నాకు చివరకు ఇక్కడకూడా అశాంతే ఎదురైంది. అయినా మీరు కంగారు పడనక్కరలేదు. ఈ భ్రాంతిని జయించగలను"

"డాక్టర్ సీతారామ్ విషయంలో నిగ్రహించుకొన్నట్లే—అవునా?"

"అవును. నిజానికి నేను డాక్టర్ సీతారామ్‌ను ప్రేమించ లేదని. మొన్న మా అక్క- ఆయన వచ్చినపుడు గ్రహించాను. యదార్థంగానే చెబుతున్నాను. అయితే ముందు ఆయనయెడల నాకు మోజు కలగకపోలేదు. మా అక్కను ఆయన పెళ్ళి చేసు కొన్నపుడు నా మనస్సు కొంత బాధపడకనూపోలేదు. ఆ బాధను మరచిపోవడానికే నేను ఇక్కడకు వచ్చిందికూడా"

"నన్ను ప్రేమించావు—ఇక్కడకువచ్చి ఈ ప్రేమను భగ్నం చెయ్యడానికి, నా హృదయాన్నికూడా భగ్నం చెయ్య డానికి సిద్ధపడుతున్నావు—ఇక్కడనుంచి వెళ్ళిపోవడానికి నిశ్చ యించుకొని"

"వెళ్ళకతీరదు. నేను మిమ్మల్ని ప్రేమించే ఈ ఇంట వెంగలినైనాను. మీరు జయలక్ష్మిని ప్రేమిస్తున్నారని అపోహపడ్డాను. అసూయ నిలువున దహించింది నన్ను. అయితే ఎలాగో వెళ్ళిపోదలచుకొన్నాను. నా పీడ మీకే వుండదు"

"పీడా ?"

"పీడే లేకపోతే నావంటిదాన్ని పెళ్ళిచేసుకొని మీరేం సుఖపడతారు ? డాక్టరు రోగితో ఆదరపూర్వకంగా సంభా షించడం, రోగి తనకు ప్రాణదానం చేస్తున్న డాక్టర్ యెడల కృతజ్ఞత కలిగివుండడం సహజం. ఆమాట గుర్తించలేక మీ రెవరైనా అందమైన ఆడవాళ్లతో మాటాడేసరికి నేను అసూయపడి ఏడుస్తుంటే మీకు మాత్రం ఏం సుఖం ? నాకు

నేనై మిమ్మల్ని ప్రేమించినపుడు ఆ ప్రేమను వదులుకోవడం క్షేమంకాదూ ?"

"నీకు నువ్వై అంటున్నావు—నేను ప్రేమించిన కోసమా నీ తాత్పర్యం. సరే. అక్కడ పనుందికదా. నేను తిరిగివస్తాను ఒకటి రెండు గంటలలో. అంతవరకు నాకోసం ఎదురుచూసుంచి వేచివుండు. ఇంకా మాట్లాడాలి"

"ఏంలాభం. మనం ఇంకా మాట్లాడుకుని ?"

"లాభం నష్టంమాట ఎలావున్నా అసలు మనం మాట్లాడుకోనవలసినసంగతే వేరు" అంటూ డాక్టర్ శ్రీనివాసన్ కారు స్టార్ట్ చేశాడు.

నవనీతం మెల్లగా లోపలికివచ్చి, తన గదిలోనికిపోయి, మంచంపైన కూలబడి నిస్సహాయురాలై పోయినట్లు—నిరాశా భావంతో "అయ్యో! భగవంతుడా!" అని ఒక్క దీర్ఘ నిశ్వాసం విడిచింది.

## 16

కొంతసేపు అలాగే పడుకొని ఒక చిన్న కునుకు తీయడం మూలంగా మనస్సులోని భారం కొంచెం తగ్గినట్లు కాగా నవనీతం లేచి, నీళ్లు పోసుకొని; యూనిఫారం ధరించి జయలక్ష్మి దగ్గరకు వెళ్ళింది.

జయలక్ష్మి—"రా! నవనీతం! ఇలా కూర్చో! నామీద కోపగించవుకదూ" అంది.

"నేను ఇందాకా అంత తీవ్రంగా మాట్లాడినందుకు క్షమించరూ!" అంది నవనీతం.

"అందులో క్షమించవలసినంత పనేమీ లేదు ఏం బాధపడకు. ఆయనకు స్వస్థంగా వుంది. లేచి తిరగగలరు. నాకదే బ్రహ్మానందంగా వుంది. నువ్వు డాక్టరుగారు ఇంక కొన్ని నెలలైనా వుంటె—"

"వెళ్లిపోతాను తల్లి......ఆయనకూడా వెళ్ళిపోతా మంటున్నారు. చాలాసేపైంది రంగస్వామిగారినిచూసి, వెళ్లి వస్తా" నంటూ నవనీతం రంగస్వామిగారి గదిలోనికి వెళ్లింది.

"ఏమైతేనేం గాని, ఇప్పుడు నా మనస్సు ఇల్లూకూడా ప్రశాంతంగా వున్నాయి నీ దయవల్ల. కల్లోలితమైన పరిస్థితి

చక్కబడ్డది. అయితే వెళ్ళిపోతానని నిన్న నన్నావు నిజమేనా? నవనీతం ” అని రంగస్వామిగారు అడిగారు.

“ నిజమే. మీకు స్వస్థత కలిగింది. ఇక నేను మా అక్క దగ్గరకుపోతాను. అయితే మరొకనర్సు కుదిరేవరకు వుంటాను. నామాటకేం. డాక్టర్‌గారైనా వుంటే బాగుంటును. ”

“ ఏమో, దైవకృప ఏలావుందో, ఆయన మనస్సు మారాలి ”

కాస్సేపు రంగస్వామిగారితో మాట్లాడి—ఆమె అటూ ఇటూ తిరుగుతూ వుండగానే డాక్టర్ శ్రీనివాసన్ వచ్చాడు.

అప్పటికి సరిగా మధ్యాహ్నం మూడుగంటలయింది.

“ రా. మనం ఒకచోటుకు వెళ్లాలి. తిరిగి వచ్చేసరికి ఆలస్యం కావచ్చు. చలిగాలి వీస్తోంది. స్వెటర్ తెచ్చుకో ” అన్నాడు డాక్టర్ శ్రీనివాసన్.

నవనీతం స్వెటర్ ధరించే వచ్చి, కారులో కూర్చున్నది.

కారు సుమారుగా కొండలమధ్యనుంచి, తోటలమధ్య నుంచి వున్న నిర్జనమైన మార్గంగుండా బదిమైళ్ళ దూరం వెళ్లాక, ఆపుచేసి—“ ఇటువంటి నిర్జనమైన స్థలంలోకూడా రెండు మూడు వందల గడప గల పల్లెలున్నాయి. ఇటువంటి చోట నువ్వు వుండగలవా నవనీతం ” అని డాక్టర్ శ్రీనివాసన్ అన్నాడు.

“ అమ్మో ” అంది.

"రా. ఓ పదిగజాలదూరం నడుద్దాం"

నవనీతం కారుదిగి, శ్రీనివాసన్ వెంట నడవసాగింది. వందగజాలదూరం లోపుగానే వారికి ఒక తోటలోని బంగాళా కనిపించింది.

"అబ్బ! ఎంత చక్కగా వుంది ఆ బంగాళా" అంది నవనీతం.

"అక్కడకే మన పోకడ" అన్నాడు శ్రీనివాసన్.

ఇద్దరూ తోటలో ప్రవేశించారు.

"ఈ చుట్టుప్రక్కల ఎంతోమంది ప్రజలున్నారు. వీరు ఏ రోగంవచ్చినా మందుకోసం పదిమైళ్లు నడిచి పట్నానికి వస్తారు. కాని ఈ ప్రాంతంలో ఒక్క డాక్టరైనా లేడు. ఒక్క ఆసుపత్రీలేదు. రోడ్లే సరిగా లేవాయె. అయితే ఒకమాట.— ఇటువంటి బంగాళాలో నువ్వు వుండగలవా ?"

"ఉండలేకపోతే-ఇది ఎవరు కట్టించారో. వారు ఎలా వుండగలిగారు ? అలాగే ఎవరైనా వుండవచ్చు"

"ఉండగలం అంటే నా మనస్సులోవున్న ఉద్దేశం చెబుతాను"

"ఉండగలం అని నన్నుకూడా కలిపే మాట్లాడుతున్నా రేమిటి ?"

"అవును. నిన్నుకూడా కలిపే మాట్లాడుతున్నాను. కలపాలన్న ఉద్దేశం పెట్టుకొనే మాట్లాడుతున్నాను కూడాను.

ఇది ఎంత సుందరమైన ప్రదేశం? ఎంత ప్రశాంతమైన-చోటు? ఎంత హాయినిచ్చే చల్లనిగాలి వీస్తుంది? ఇటువంటిచోట స్వయంగా డిస్పెన్సరీ పెట్టుకొని, ఈ ప్రాంతంలోని వారికి సేవ చెయ్యాలని నాకు ఎన్నాళ్ళనుంచో సంకల్పం. ఈ బంగాళా మా తాతగారు కట్టించారు. ఆయన డాక్టరు. మా నాయన డాక్టరు. మా నాయన యుద్ధానికి వెళ్ళి అక్కడనే మరణించారు. నేను యుద్ధంనుంచి తిరిగివచ్చాక నా కోరిక నెరవేరడానికి ఒక్కటే ప్రతిబంధకమయింది. నేను ఒక్కణ్ణే ఇక్కడ ఉండదలచుకొనలేదు. నా హృదయంలో ప్రణయం నెలకొన్నపుడే— ఆ ప్రణయాధిదేవత ఇక్కడ నాతోపాటు నివసించే భాగ్యం లభించిన తర్వాతనే అటువంటి ప్రయత్నం చెయ్యాలనుకున్నాను. నిన్నుచూచి, నీ ప్రకృతిని గ్రహించ గలిగిన తర్వాతనే నా మనస్సులో ప్రేమ అంకురించింది. ఆ ప్రేమతోనే నిన్ను జయించాలనేకోర్కె ప్రబలమయింది. జయలక్ష్మిని నేను ప్రేమించానని అనవసరంగా అపోహపడి, బాధపడ్డావు. నేను జయను ఎన్నడూ ప్రేమించలేదు. నువ్వు నన్ను ప్రేమిస్తున్నట్లు అనుమానపడే ఆమె "మేము ఒకరి నొకరం ప్రేమించుకొంటున్నాం" అని నిన్ను దబాయించింది. అంతేకాని అందులో నిజం ఎంతమాత్రంలేదు. నేను నిన్నే ప్రేమించాను. నీకు ఇష్టమైతే— ఇక్కడే— ఆరుగురు రోగులకు తగిన వసతి కల్పించి, ఆసుపత్రిని నడపగలం. లేదా పట్నం లోనే వుందాం. లేదా మదరాసైనా పోదాం."

" ఇవన్నీ వదిలివేశా ? "

" అవును. "

" జరుగుబాటో "

" నౌకరి చెయ్యకపోయినా కాలం సుఖంగా గడిపివేయ డానికి చాలినంతఆస్తివుంది. లక్షరూపాయలదాకా బ్యాంకులో వున్నాయి. మా నాయన, తాత సంపాదించిపెట్టిన డబ్బది "

"అయితే ఈ మాట జయలక్ష్మికికూడా తెలియదా?"

" తెలియదు. పైగా డబ్బుకోసం ఎవరూ నన్ను పెళ్ళి చేసుకోరాదనే మతం నాది. చిట్టీ! నిజంచెప్పు. నన్ను ప్రేమిస్తావా ? నన్ను పెళ్ళి చేసుకొనడానికి అంగీకరిస్తావా ! "

నవనీతం మనస్సు ప్రణయవిహ్వాలములైన ఆ మాటలను వింటూవుంటే ఆనందమయములైన లోకాలలో పరిభ్రమించ సాగింది. తాను ఇంతకాలం మనస్సులో డాక్టర్ శ్రీనివాసన్ స్వరూపాన్ని ప్రతిష్ఠించుకుని పూజిస్తూ వచ్చింది. జయలక్ష్మిని ఆనాడు ఆయన ఓదారుస్తున్నపుడు చూడగానే ఆ ప్రేమను తన మనస్సునుంచి తొలగించి వేయడానికి యత్నిస్తూవచ్చింది.

చివరకు అతడే స్వయంగా, ప్రాధేయపూర్వకంగా బ్రతిమాలుతున్నాడు. ఆ మాటలన్నీ విని " బాగానేవుంది " అంది నవనీతం—

" ఏమిటా బాగున్నది ? నే నడిగినదానికి " ఎస్-అనో-నో—అనో—ఏదో చెప్పివేయి "

"ఇప్పుడే చెప్పివేయాలా ?"

"అవును"

"అయితే "ఎస్సే"—

"ధన్యుణ్ణి. నవనీతం ! ధన్యుణ్ణి" అంటూ డాక్టర్ శ్రీనివాసన్ నవనీతాన్ని దగ్గరకు తీసుకుని– అస్తంగత భానుని స్వర్ణకిరణకాంతి ప్రసరించడంతో మరింత అందంగా కనిపించిన నవనీతం కెంబెదవులను ముద్దుపెట్టుకొని "మన ప్రణయానికి చిహ్నంగా ఈ బంగాళాకు "ప్రణయమందిరం" అని పేరు పెట్టుకొందాం" అన్నాడు.

అదే సమయానికి ఆ తోటలోనే ఏ మూలనుంచో కోయిల "కో" యని కూసింది. "మన కది మంగళగీతం కాబోలు" నని నవనీతం డాక్టర్ శ్రీనివాసన్ ఒకే సమయంలో అన్నారు. అలా అన్నందుకు కాబోలు ఇద్దరూ పకపక నవ్వు కున్నారు కూడా.

# ప్రఖ్యాత నవలా సాహిత్యం

| | | |
|---|---|---|
| మర్డర్ | (డిటెక్టివ్) | 1-8 |
| బ్యాండిట్ | | 1-8 |
| పాతాళగృహం | | 1-8 |
| నేనూ-మాజానకి | | 1-8 |
| మాధురి | | 1-0 |
| మోహిని | | 1-0 |
| ఎడ్డీఫోలో | | 1-0 |
| చండశాసిని | | 1-0 |
| మృగపిశాచి | | 1-0 |
| దండధరుడు | | 1-0 |
| దివిటీదొంగలు | | 1-0 |
| సి. ఐ. డి. | | 1-0 |
| అన్ జాన్ డాకూ | | 1-4 |
| ఎ.బి.సి. హత్యలు | | 1-0 |
| ఖూనీపై ఖూనీ | | -12 |
| తుఫాన్ మెయిల్ | | 1-0 |
| డాన్సింగ్ గరల్ | | 1-0 |
| సురస | (చారిత్రిక) | 1-8 |
| చాందసుల్తానా | | 1-8 |
| అమరవిజయం | | 1-8 |
| రుద్రమదేవి | | 1-8 |
| సాహసిక | | 1-8 |

త ల యు వా రు
కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్
సంస్కృతాంధ్ర గ్రంథాలయం. రాజమండ్రి.

# ఆంధ్ర ప్రచారిణీ లిమిటెడ్ వారి
# ప్రఖ్యాత నవలా సాహిత్యం

| | | | | | |
|---|---|---|---|---|---|
| మాయావి-భాగం | 1 | 2-0 | శ్యామల | | 2-8 |
| మనోరమ ,, | 2 | 2-0 | సాధన | | 1-0 |
| మాయావిని ,, | 3 | 1-0 | పరిమళ | | 1-8 |
| 264 ,, | 1 | 2-8 | అక్షరూపాయలు | | 1-0 |
| ,, ,, | 2 | 2-8 | మరకత మంజూష | | 1-8 |
| వీరపూజ | | 2-8 | మాధవసేనుడు | | 1-0 |
| భూతస్మశానం-భాగం | 1 | 2-8 | మాధవిలత | | 2-8 |
| ,, ,, | 2 | 2-8 | అమరవిజయము | | 1-8 |
| నీలాంబరి | | 2-8 | సురస | | 1-8 |
| పరమరహస్యము | | 2-8 | చాందసుల్తానా | | 1-8 |
| ప్రతిజ్ఞాపాలనము | | 2-8 | రుద్రమదేవి | | 1-8 |
| జీవన్మృతరహస్యము | | 2-8 | ప్రసన్నముఖి ([illegible]) | | 1-0 |
| రహస్య విప్లవము | | 2-8 | అరవింద-భాగం | 1 | 1-8 |
| జయాపజయములు | | 2-8 | ,, ,, | 2 | 1-8 |
| రహస్యశోధనము | | 2-8 | ఉషాసుందరి | | 1-0 |
| సమానప్రతిభ | | 2-8 | శోభానాక్షి | | 1-0 |
| రహస్యగోపనము | | 2-8 | రైన్ నదీతీరం | | 1-0 |
| లక్ష్మీకాంతము | | 2-8 | ప్రణయమందిరం | | 1-0 |
| లీలావతి | | 2-8 | నలుగురు దొంగలు | | -12 |
| నీకేజయం-భాగం | 1 | 2-8 | అపరాధి ఎవరు? | | 1-0 |
| ,, ,, | 2 | 2-8 | పరిత్యక్త | | 1-8 |

ప్రాప్తిస్థానం

**కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్,**

సంస్కృతాంధ్ర గ్రంథాలయం [స్థా 1882] రాజమండ్రి